శ్రీరస్తు

శ్రీ వేణుగోపాలకృష్ణ పరబ్రహ్మణేనమః

శ్రీ

# చక్రధారిశతకము

ఇది

గుంటూరుజిల్లా నత్తెనపల్లితాలూకా కంటెపూడి
పింగళిమల్లయామాత్య కామాంబాగర్భశుక్తి ముక్తాఫల
మానుఁడును, వివిధవిబుధజన విధేయుండును నగు

శ్రీయుత వేంకటసుబ్రహ్మణ్య కవిచే

రచియింపఁబడి,

గుంటూరుజిల్లా నత్తెనపల్లి తాలూకా కోమెరపూడి వాస్తవ్యులును
వెంకయ్యగారి పుత్రుండును భక్తజనాగ్రగణ్యుండునునగు
శ్రీయుత గుండవరపు మల్లిఖార్జునరావు
గారి ద్రవ్య సహాయముచే

గుంటూరు వాణీ ముద్రాక్షరశాలయందు
ముద్రింపఁబడియె. 1935.

 Rs. 0-4-0.

ఓమ్

శ్రీరస్తు

శ్రీ వేణుగోపాలకృష్ణ పరబ్రహ్మణేనమః

# శ్రీ చక్రధారి శతకము

ఇది

గుంటూరు జిల్లా నత్తైనపల్లి తాలూకా కంకెపూడి గ్రామ నివాసి పింగళి

మల్లయామాత్య కామాంబా గర్భ శుక్తి ముక్తాఫలాయమానుండును,

వివిధ విబుధజన విధేయుండును నగు

వేంకట సుబ్రహ్మణ్యకవిచే

రచియింపఁబడి

గోపాలుని హనుమంతరాయ శాస్త్రిగారిచే

పరిష్కరింపఁబడి

గుంటూరు వాస్తవ్యులు

శ్రీయుత గుండవరపు మల్లికార్జునరావుగారి

ద్రవ్యసహాయముచే

బెజవాడ వాణీ ముద్రాక్షరశాలయందు ముద్రింపబడినది.

1933



వెల 0—8—0.

# విజ్ఞప్తి

---

శ్రీమహావిష్ణుండీ పదునాల్గు భువనంబులం దనహృదయాంతరాళంబునందిడి సకలప్రాణి సమూహంబుల జననస్థితిలయాదులకు కర్తయై కేశవాచ్యుతానంతాది నామంబులం బ్రసిద్ధిం జెందు. నామహామహుని నామస్మరణ, స్నేహ, శ్రవణదాసత్వనమస్కారార్చనాదులను పరమభాగవతోత్తములు నిరంతరంబాచరించి కైవల్యపదవిం జెందిరని పెక్కు పురాణంబులు సూచించుచున్నవిగాన అట్టి విశ్వేశ్వరుని మహిమ, మనోవాక్కాయకర్మలచే నుతింప బ్రహ్మాదులకైన దరంబుగాదన నాబోటికించిజ్ఞునకా భగవన్నామామృత పూరంబు గోచరంబా? యనను నానంటి మూఢజనుడు జనన మరణప్రవాహాదుల మునుంగక దరిసేరు తెరవిదేయని శ్రీకృష్ణకోలంది భగవద్గీత నుత్తరగీతాదుల సారాంశమును ద్విశతమేక సీసపద్యావళిచే స్తుతించి భగవదర్పితంబొనర్చినాడగాన సుకవిజనపండిత బృందంబులతిశయానుగ్రహంబుంచి యందలి లోపములను సవరించి సన్మానందింప జేయుదురని వేడుచున్నాను.

ఇట్లు విన్నవించు విబుధవిధేయుడు,

[illegible]ంగలి వేంకట సుబ్రహ్మణ్యకవి,

సత్తెనపల్లి తాలూకా,

కంటెపూడి గ్రామనివాసి

క॥ పొంకముగా నా మల్లయ
కుం గామాంబికకు బుట్టి • కొడుకొక్కడు శ్రీ
వేంకట సుబ్రహ్మణ్యము
అంకితమిడె చక్రధారి • కను శతకంబున్॥ 4

ఉ॥ ఆవర చక్రధారి శత•కాభిధ పుస్తకమెల్ల జూచితిన్
కేవల భక్తిపూరితము • కేశవుపైగల భక్తి జెప్పె నిం
దేవిధమైన లోపములు • హెచ్చిన నయ్యవి దిద్దుడయ్య ల
క్ష్మీవరు భక్తుడాతడు సు•మీబుధులార దయాస్వయాత్ములై.

ఇట్లు విన్నవించు వివిధ బుధవిధేయుడు,

కొండభోగిభూషణరావు.

శ్రీ వేణుగోపాల మూర్త్యైనమః

# విజ్ఞప్తి

గుంటూరు తాలూకా చిన కొండ్రుపాడు నివాసియగు
బలభద్ర పాత్రుని వేంకటసుబ్బయ్య యిట్లు వ్రాయుచున్నాను.

శా॥ శ్రీ మత్పింగళి వంశమందుదయమై • సేవించు శ్రీకంఠు బల్
నామంబుల్ నిరతంబు నెంచి మదిలో • నానందమున్ జెందు శ్రీ
కామాంబామణి మల్లయాభిదులకున్ • గారాబు పుత్రుండ నీ
సామర్థ్యంబు వచింతు నేడు వినుమీ • సాక్షాత్కరింపం బుధుల్॥

మ॥ వర శ్రీ శైలములాది క్షేత్రములు దా•వర్ణించుచున్ బోవుచున్
మరి బూజించుచు మౌని సంఘముల స•న్మానంబులన్ జేయుచున్
గిరి ప్రాంతంబులనుండి మీజనకు మేల్•కీర్తుల్ ప్రకాశింపగా
గురితో శంభునిగూర్చి సల్పె తపమున్•గూర్మిన్ సురల్ మెచ్చగన్॥

ఉ॥ పింగళి వంశవర్ధనుడ ♦ పిత్రుసమానుడ విష్ణు నీకులన్
భంగము లేని భావమున ♦ ప్రార్ధన జేతు వహర్నిశంబులన్
మంగళమూర్తి చక్రధర ♦ మాధవకృష్ణ రమేశ శంకరా
చెంగటజేర్చి బ్రోవుమని ♦ చెన్నుగ మ్రొక్కుచు గొల్తు నెప్పుడున్.

చ॥ కరినుతు చక్రధారి శత ♦ కంబు రచించి సుభక్త కోటికిన్
మరి ముదమంద జేసితిరి ♦ మాధవు నామ సుధారసంబునన్
నరశతకంబు వ్రాయ విన ♦ వర్ధిలుచుంద్రు నరుల్ సుఖంబుగా
హరిస్మరణామృతంబు నను ♦ హాళిని జెందిన వారె యుత్తముల్ 4

క॥ శ్రీ చక్రధారి శతకము
ఆచంద్రార్కముగ భువిని ♦ నతిశయ కాంతిన్
మేచకవర్ణుని కృపచే
వాచస్పతులౌ ననంగ ♦ వర్ధిలుగాతన్. 5

క॥ కలియుగ మైదుసహస్రం
బులపై పదిహేను యేండ్లు ♦ బుధమిని గడచెన్
విలసిత యానందాబ్దము
అలమధువున కృష్ణదశమి ♦ కంతయు ముగిసెన్॥ 6

సామర్థ్యము గలకొల
నీ సచ్ఛతకంబు జూచి ♦ తెందలి నెరసుల్
వాసిగల పెద్దలెల్లను
భాసిల్లగ దిద్దుడనుచు ♦ ప్రస్తుతి జేతున్ 7

క॥ బ్రహ్మోద్భవ వేంకట సు
బ్రహ్మణ్యము జెప్పె మంచి ♦ ప్రజ్ఞానమునన్
బ్రహ్మఖ్యు జనకు శతకము
బ్రహ్మార్పితమనుచు మది స ♦ భక్తి ముదమునన్॥ 8

క॥ శ్రీ చక్రధారి శతకము
వాచస్పతు లౌననంగ ♦ వర్ణించు కవిన్

మేచకవర్ణుడు హరి సం
కోచింపక బ్రోచుగాత • గోవిందుడొగిన్॥ 9

ఇట్లు విన్నవించు
పరమభాగవత భృత్యానుభృత్య భృత్యుడు
బలభద్రపాత్రుని వేంకటసుబ్బయ్య,
చినకొండ్రుపాడు, బోర్డుస్కూల్,
ప్రధానోపాధ్యాయుడు,
తే 20-4-1914 తాలూకా, జిల్లా, గుంటూరు.

శ్రీ జగదీశ్వరాయనమః

ఉ. శ్రీయుతగాంగ దాంఘ్రిసర • సీరుహపాదపదంతరంగు డ
త్త్యాయత పుణ్యశాలి కరు • ణాభరణుండు పరుయోగశాస్త్ర వి
ద్యాయుతుడు సత్యవర్తనుడు • ధీరుడు పింగళి వంశవర్ధనుం
డేయనఘుండు మల్లయము • హామహుడాయనమించె ధాత్రిపై 1

గీ॥ ధరణిం గోత్రపాత్రి • ధాముడై పిదప దా
గోత్రపాటి వంశకుడన వెలసె
గాంచెనాత్మ భార్య • కామాంబయందుగు
మారుకలుపనగశ • తారుధీరు॥ 2

వ. ఆమహాత్ముండు

క. వేంకట సుబ్రహ్మణ్యాభి
ధానకుడు తత్త్వవేది • యకలుషభక్తిన్
పొంకముగ గూర్చె సాధువ
శంకరమలచక్రధారి • శతకరాజమున్॥ 3

క॥ ఆమహనీయుని చరితం
బీమహిని జెప్పనేల • నేమన దీనిన్
బ్రేమం బఠించిన బలియుగ
దామునఁజేతి కడియమున • కద్దంబేలా॥ 4

చ॥ కరమనురక్తి నేను శత ♦ కంబును సర్వము జూచియాత్మయం
దరుసము జెందినాఁడ బర ♦ మాత్ముని భక్తుల సాధుపద్ధతుల్
సరసులు నెల్లచోటులను ♦ చాటుట లోకప్రసిద్ధమే కదా
గిరిశుఁడు సత్కృపారస వి♦కీర్ణపుఁజూపులఁ జూచు నీకవిన్

సత్తెనపల్లి తాలూకా,
దొడ్లేరు.
౨7—9—17

ఇట్లు సజ్జనవిధేయుఁడు,
భీమిరెడ్డి వెంకటప్పారెడ్డి.

I read a number of verses in this book and have been impressed with the devotional character of the work. I heartily congratulate the author on his fine production.

Camp. Sattenapalli,
25th July 1919

(Sd.) V. RAMAYYA,
Hd Qrs Dy. Collector.

I have known this Poet for a long time past. He is the son of a father who is famed for his piety devotion and exemplary life He was addicted to Yoga Practice and never cared for the pleasures of life being absorbed in deep meditation. He at times used to fast for days and months it was said.

He was a great devotee of Sri God Malleswara of Sri Saila Mountain. When the Rohila free booters came there on a predatory excursion and robbed the temple of its valuable jewellary, he (Mallayya Garu, the father of the poet) was sitting in Yoga Samadhi in front of the temple. It was said that the robbers mistaking him for an archaka of the temple, questioned him about the jewels and receiving no reply from him sacked him with their swords. The talk goes that Mallayya garu did not feel the slightest pain. Though he lead a family life, he used to spend much of his time in devotion and meditation in Mangalagiri, Krosur, Ameenbada, Amaravati, Ponnur &c, besides Sri Sailam which was his beloved resort. It was said that Markandeya and Narada appeared to him once in a vision and promised him salvation. He composed a Seesa Malika

in memory of the sacking of Sri Sailam by Rohilas.

Such is the father of the Present poet He inherited the deep devotion of his father and his poetical talents to a certain extent. He composed three poems (1) Kesava Sathakam, (2) Chakradhari Satakam & Sankara Satakam, all breathing Bhakti from top to bottom He made no difference between Vishnu and Siva and showed his impartiality by the composition of the above three poems. The publication of the poems will, I trust, be of great benefit to the public in as much as they teach that love and devotion to God will secure salvation. The Poems will, I hope, see the light of Publication erelong.

(Sd). R. U. V. GOPALA RAO, B. A.,
Political Pensioner.
Sattenapalli,
3—9—19.

I have heard the Poems composed by the Poet, read over to me and I was very pleased to hear them. They breathe noble ideas of great Bhakti and are quiet

The son has certain commandable feelings of devotion, tried to justify his position as dutiful son of his great and pious father. May God give him the chances to further his access to reach the high position of his father. The verses deserve to be printed and presented to the use of others.

(Sd).
Salt Dept,
Narasaraopet, 9—9—20.

---

The author of these verses is the karnam of Kantepudy village. He is very God-fearing and religious man. As regards the devotion and yogi practice of his late father, I endorse the remarks made by Mr. R. V. Gopala Rao Pantulu Garu B. A.

(Sd). Mr. I. MOHIDDIN,
Tahsildar on leave.
16—7—21.

I read the Satakam through and through and am much pleased with the devotional nature of the work The writer has inherited his talents from his worthy father who shuffled off his mortal coil with the ease and hilarity of a "Rishi". The style is chaste and the poems are well worth the study.

(Sd). P. C. APPAL NAIDU,
Rev. Inspector.
24—1—22

---

ఓమ్ జగదీశ్వరాయనమః

సీ. శ్రీసదాశివపాద - సేవాధురీణుండు
రమణీయసుగుణ వి - రాజితుండు
సాధుజనస్తవ్య - సదమల చరితుండు
విమలమానసుడు దు - ర్విషయవిముఖు
డాద్యసంసేవాని - వార్యకీర్త్యావహుం
డుత్తమచరితుండు - యోగరతుడు
కొర్రపాటికులాబ్ధి - కువలయాప్తుండు సు
బ్రహ్మణ్య సుకవి స - ద్భక్తిమీర
జెప్పె నీశతకంబు వి - రచించినాడ
భక్తిరసము ప్రధానమై - బరగుచుండె
భక్తవత్సలుడైన యా - పరమపురుషు
డాకవీశుని ననుకంప - నేలుగాత.

ది 17—9—22 సం॥

ఇట్లు విన్నవించు బుధవిధేయుడు,
అన్నపురెడ్డి శేషిరెడ్డి,
సత్తెనపల్లి తాలూకా, కోట నెమలిపురి,
పిడుగురాల పోష్టు,

శ్రీ సత్యనారాయణమూర్త్యాయనమః

ఈపద్యములు వ్రాసిన కొర్రపాటి వెంకట సుబ్రహ్మణ్యము గారు చాలా ప్రవీణులు. వారి తండ్రిగారుకూడా చాలా గొప్పవారని

వాడుక. ఈ వేంకట సుబ్రహ్మణ్యముగారు చాలా భక్తిపరులు, నేను వారిని బాగా నెరుగుదును.

(Sd.) భూ. వెంకటపతిరాజు వ్రాలు,
పోలీసు సబుయినస్పెక్టరు,
సత్తెనపల్లి, ది 24—3—23.

I studied this book more closely. The verses are very fine and reveal the piety and devotion of the author.

The author is the Karnam of Kantepudy. His father is said to be a saint. He did his penance mostly in Sri Sailam which is the abode of God Siva—The Karnam of Kantepudy, Mr. Korrapati Venkata Subrahmanyam is also a devotee. Mr. Mallayya garu the father of Venkata Subrahmanyam lived for about 90 years and lead a very pious life. He lived as a married man till the end of his life and never took Sanyasam, From this it can be seen that Gruhastasramam is the best of all people though living with their family can reach the goal, Moksham more easily than a Sanyasi and those that study this book will not only become pious men but will be a source of help to the world at large. No doubt it would be a hard task to become pious men in this age of Kaliyuga which is surrounded by sinners. People should see such men as their Gurus and lead a virtuous life in order to attain salvation

(Sd.) P. VENKATESWARLU,
R. I., Phirangipuram.
3—10—23.

I have fully gone through the book and am very much impressed with the devotional nature of the work. The verses are full of devotion of God and are worthy of its author. The father of the author of this little book has had the reputation of being a true devotee of God and of having proved invincible to the onslaughts of the Rohillas who attempted to murder him.

I wish this book would soon be printed and published for the good of the public.

(Sd.) M KOTESWARAROW,
Tahsildar.
3—8—23.

ఈ శతకము రచించిన కవిని షుమారు పదునైదు సంవత్సరములనుంచిన్ని అందులో కొంతకాలము ఖండపు రివిన్యూ యిన్స్పెక్టరుగా వున్నందున బాగా యెరుగుదును. వీరి పితృలు శ్రీశైల పర్వతమందు మహత్తరమైన తపస్సు చేసిన మహనీయులు. వీరుగూడా వారి గర్భమందు జనించిన కతంబున కొంతవరకు వారి శాంత స్వభావమునే గ్రహించి తమ కాలమునంతయు పరమేశ్వర భక్తియందే గడపేవారు. వారియొక్క శుద్ధ సత్వ స్వభావము, వైరాగ్య సంపత్తి, పరమేశ్వరుని యందలి యనన్యభక్తి యి శతకమే ప్రకటించుచున్నది. పరమేశ్వరుడు వారికి చిరాయువు లొసంగుచు వారి వంశమును నిత్యము శుద్ధసత్వ మార్గమందే ప్రవర్తిల్ల జేయవలెనని ప్రార్థించుచున్నాను.

కొమ్మరాజు నరసింహాం, బి. ఏ.,
29— 3—24,

అదృష్టవశమున నేడు యీ శతకములోని కొన్ని పద్యములను చూచుటకు నాకు భాగ్యము గల్గెను. ఈ రూపమున భక్తిసామ్రాజ్యమును చూరగొన్న యిక్కవి తల్లజుడు ధన్యులలోధన్యుడు. ఇందలి ప్రతిపద్యము భక్తి రసపూరితమై, సరళభావ సమన్వితమై, సహజపదధారా భూయిష్టమై, పామరులకైనను తెలియగల శైలిలో మాధుర్యముగా వ్రాయబడినది.

ఒకరిమెప్పునకుగాక, ఎట్టి ఫలాపేక్షయును లేక, అందుకని యెట్టి ప్రయత్నము చేయకయే సహజధోరణిలో భగవంతుని గానము చేయబడిన దగుటచే యీ శతకరాజమెట్టి మహోత్కృష్ట స్థానమును

బడయగలిగినదో నేను వేరుగా జెప్ప నవసరము లేదు గాని మొదటి నుండియు, కొండవీటి సీమ, కవిఫల సస్యశాలిని యగుటచేతను వేమనాదులను గనిపెంచినదగుటచేతను అట్టి తల్లిపోలికలె మనకవియందు, గలియుండి, తన యిష్టమువచ్చినప్పుడు, యేచెట్టునీడనో యేగుట్టకడనో, కూర్చుండి భగవంతుని దివ్య మహిమలను వర్ణించి, ఆనందించి తన్మయుడయ్యెనని మాత్రము యిచట చెప్పదగును.

మరి యీ యిమ్మహనీయుడు కవిత్వమునకు పుట్టుపోసిన పింగళి వంశచంద్రుడు. సత్య శాంతధౌరేయుడు. సదాచారము, సచ్ఛీలము వీరికి పెట్టనిసొమ్ము. వీరిని నేను స్వయముగ నెరుగుదును. ఇట్టి శతకములనే యింకను రచించి ఆస్తికవ్రజము నలంకరింపజేయ వీరికి సర్వశక్తుల నొసంగుటకా జగదేకజనకుని ప్రార్థింపుచు దీనిని విరమింపుచున్నాడను.

గుడిపూడి, 20-4-24.

ఇట్లు విధేయుడు,
పరమాత్ముని లక్ష్మీనారాయణ.

---

I have gone through the verses and could read through them the devotional attitude of the author, who is the karnam of Kantepudy and whom I know for several years. He is a worthy son of a worthy father, who was well-known in these parts for his austerity and sincere devotion to God. The writer hopes to get this book printed and I wish him success in his attempt.

(Sd). S. MUKHYA PRANA RAO.,
S. Magistrate,
Sattenapalli,
20—6—24.

---

The author of this precious Satakam is well known to me as a great devotee and a philanthropist. The verses contained in this, when read out to me by his worthy son, I was overwhelmed with joy and was fully inspired with sensational sanctity. No one will be deprived of God·

liness when once this is picked up. I have no hesitation whatsoever to place this worthy Satakam next to Narasimha Satakam. The invaluable allusions contained in this will, I am sure, appeal every mind to cram them by heart with a view to utter them when the least opportunity is presented to meditate and concentrate upon the Almighty, be He Vistnu or Siva, irrespective of Trinity. May God enhance manifold his Bhakti and Vairagyam and give him long life and longivity a worthy son to the worthy father.

(Sd). P. SUBBARAYALU,
Veterinary Asst. Surgeon,
Sattenapalli,
21—9—24.

౧౦.

శ్రీహయగ్రీవాయనమః

ఉ॥ శ్రీకరుఁ డార్యవందితుఁడు ♦ చిన్మయమూర్తి సమస్తలోక భ
ద్రాకరుఁ డవ్యయుండు చతు ♦ రానన ముఖ్యసురాళి పూజ్యుఁ డ
స్తోక యశోవిభాసి దితి ♦ సూనహరుండును మాధవుండు దా
వీకననారతంబు గడు ♦ వేడుకఁ బ్రోవ్రత గాత నీకవిన్.
సీ. శ్రీశైల మల్లేశు ♦ సేవింపగా వెళ్ళి
యుగ్రతపంబులో ♦ నుండె నెవఁడు
క్రూరులౌ నోహింలాల్ ♦ క్రుద్ధతన్ తనుఁగొట్ట
చెక్కుచెదరని సు ♦ స్థిరుఁ డెవండు
తన తపశ్శక్తిచే ♦ తను మునిశ్రేష్ఠులౌ
నారదాదులఁ గాంచు ♦ నఘుఁ డెవఁడు
నిరతంబు దపమునే ♦ నెలవుగా గైకొని
భక్తిమై గ్రాలెడి ♦ భక్తుఁ డెవఁడు
గీ॥ అట్టి ధీరుఁడు మల్లయా ♦ హ్వాయుఁడు ఘనుఁడు
వారికిని చూడఁ గామాంబి ♦ కారమణికి

బుట్టి నీ కవి వ్రాసె నీ ♦ పౌత్రమరయ
గాంచి సంతసమందితి ♦ కలుషమడగ.

తే॥ గీ॥ కొర్రపాటి కులాబ్ధికి ♦ కుముదసఖుడు
సుకవిధీరుడు భక్తుడు ♦ సుజనుడార్య
డమల యశుడును సుబ్రహ్మ ♦ ణ్యాఖ్యుడరయ
వ్రాసె దీనిని కృపతోడ ♦ వాసిగాంచ.

ఉ॥ ఎచ్చట నేరసంబుదగు ♦ నెచ్చట నేవర శబ్దజాలముల్
నెచ్చట మంచిభావములు ♦ నెచ్చట యుక్తులు భక్తిమార్గముల్
నెచ్చట నే సమాసములు ♦ నింపును పెంపుగ నింపుచుండునో
నచ్చటజేర్చె వాని సుగు ♦ ణాఖ్యుడు నీకవి మెచ్చ నెల్లరున్.

గీ॥ కలుష మడచును భక్తిమా ♦ ర్గముల జూపు
నర్ధముల నేర్పు బుద్ధిమాం ♦ ద్యమును బాపు
పుణ్యమునొసంగు జదివెడి ♦ పుణ్యులకును
గాన ప్రతివారు చదువు [illegible] ♦ కరముదీని.

ఇట్లు విబుధజనవిధేయుడు,
నందిగామ శేషయ్య,
వీరగోపాల కృష్ణానాథ శరణాలయపు రెండవమాష్టరు,
పిల్లుట్ల.

పల్నాడు తాలూకా,
పిల్లుట్ల.
21—1—25

The author of this book is the son of the well known Saint, Pingali Mallayya kavi. It is said that while he was doing penanct on the hills of Sreesailam, he wass attacked by the Rohillas who had attempted to murder him. But he coolly submitted to their onslaughts. The only Peculiarity in this saint was that he made such a penance while he was in the 'Garhastyam' that even the sanyasis could not do. The verses composed by the author are very interesting and teach entire devotion to God. My short experience of this author is that he spends more time in devotion than to his house-hold affairs. I pray God that the author should be bestowed long life so that he may write some more books which teach devotion. Like

Bammera Potaraju, the well-known author of Bhagavatam, the author of this little book has dedicated this book to the god Sreerama of Bhadrachalam.

(Sd). P. L. NARASIMHAM,
Revenue Inspector,
28—1—25.

---

I read the verses in the Chakradhari Satakam composed by the poet who is well known as a great devotee. I have known him for several years and the work is an expression of his great devotion to God

(Sd). H. VAIDYANATHIAR,
Tq. Hd. Accnt.
Sattenapalli,
21—8—25.

---

I have gone through the చక్రధారి శతకము composed by Subrahmanya kavi, Karnam of Kantepudy village in Sattenapalli Tq. with great pleasure. The verses are written in an easy loving style and are full of devotion. In this respect (devotion) he may be said to be a worthy son of a worthy father for his father was known to be a very great devotee and more or less a saint in his days.

Kantepudy, 30—8—25.

(Sd) M. SANKARAYYA,
Deputy Inspector of Schools,
Sattenapalli East Range.

---

శ్రీ శంకరాయనమః.

ఈగ్రంథమునందలి పద్యములు చాలా సంతోషముతో చదివితిని. ఇందలి పద్యములయందు భక్తి, జ్ఞాన, వైరాగ్యములు, యిమిడియున్నవి. కొన్నిభాగములయందు ఉపనిషదర్థంబులును, భగవద్గీతాభావంబులును కనబడుచున్నవి. ఈ గ్రంథకర్త పూర్వికులు తపస్సంపన్నులై యుండియున్నందున వీరికి యిట్టి భక్తిభావము కలు

గుట స్వభావికము. సర్వజనులు యీగ్రంథమును పఠనజేసి కృతార్థులగుదురుగాకయని ప్రార్థించుచున్నాను.

బ్రహ్మాండం రామశాస్త్రి, బి. ఏ.,
హెడ్‌క్లర్కు, రివిన్యూడివిజనల్ ఆఫీసు,
గుంటూరు,
ది 29—9—25 సం॥

The author of this Chakradhari Satakam traces his ancestry from that of Pingali Surana, one of the best Telugu Poets. The author's father is renowned for piety and saintly life, lead by him. He is said to have met the oldest Rishis while performing Tapassu on the Srisaila Parvatam

The author has inherited the virtues of his father in the matter of his devotion and that of his ancestor, Surana in the matter of his Poetry. The verses of this Satakam are full of devotion and I wish the book would soon be placed in the hands of the public.

(Sd). P. CHAKRAPANI,
Labour Inspector.
25—10—26.

# పంచరత్నములు

గీ॥ తాము పంపినయట్టి పో ♦ త్రంబుఁ బ్రేమ
నందినాఁడను సంతోష ♦ మందినాఁడ
చదువు సంధ్యలు రానట్టి ♦ జడునినన్ను
గొప్పజేయుట శిష్యుపై ♦ కూర్మి యొగద॥

కం॥ కృతిభర్త చక్రధారుఁడు
కృతికర్తయు మోక్షకామి ♦ కేవలమును సం
స్తుతిపాత్రమైన పండిత
తతిదగు యుద్దేశ్యమేల ♦ తర్కింపంగన్॥

మ॥ కవితా నైపుణి గల్గినందులకు ని - క్కాలంపు చిత్రంపు స
త్కవులం బోలికగాంచి నైహిక మని ♦ త్యంబంచు సద్భావ గీ
తవితానంబు రచింపబోక భగవ ♦ ద్ధ్యానైక చింతారతిన్
భువనేశుం గొనియాడ గల్గితిరి మీ - పూర్వాంపు పుణ్యంబుచేన్॥

గీ॥ చక్రధారికు శతకం బ ♦ వక్రభక్తి
రసము చిప్పిలి పారకు ♦ రాతిగుండె
నేని కరగించి మారు స్మ ♦ రింపజేయు
చిన్మయాత్మకు లీలా వి ♦ శేషములను॥

గీ॥ భక్తి తలమున్కలగునట్టి ♦ పట్టు నందు
వ్రాసితిరిగాన బదముల ♦ భావ మధిగ
మించె నొక కొన్నిచోటుల ♦ మిమ్ముబోలు
వారలకెగాక నలవియే ♦ వానిదెలియ॥

ఇట్లు,
పండిత విధేయుఁడు
వావిలాల నరసింహారావు,
కొమిరెపూడి.

---

## కృతజ్ఞత.

---

సీ॥ శ్రీ ధరాస్థలిలోను ♦ శ్రీకరంబై యొప్పు
గుంటూరు పురమందు ♦ కొమరు మిగుల
నివసించి మాన్యుల ♦ నిస్తుల కృపచేత
రాము కార్యములందు ♦ రక్తిగలిగి
కరమొప్పు శ్రీగుండ ♦ వరపు బ్రాహ్మణవంశ
జాతుడౌ వేంకయ్య ♦ సాధుమతికి
భార్యయై యొప్పెడు ♦ వర లక్ష్మమాంబకు
సుత పంచకంబౌచు ♦ నతులమహిమ

పుణ్యుండు కోదండ ♦ పాణి సీతారామ
యాఖ్యుండు శంకరా ♦ భిఖ్యునవల
సుబ్బరావును మఱి ♦ సాంపొనగూర్చెడు
నైదవ సూనుండు ♦ యనఘుడైన
మల్లికార్జునశర్మ ♦ మాననీయులు వీరి
కీర్తులు చిరమువ ♦ ర్ధిల్లుగాక
సుతు లైదుగురిలోన ♦ వితరణ గుణశాలి
మల్లికార్జునరావు ♦ మంచిసుగుణు
డై యొప్పి గుంటూరి ♦ యాంజనేయస్వామి
దేవళంబున నూత్న ♦ దీప్తిగలుగ
ప్రాకారములు దీర్చి ♦ ప్రాభవం బొప్పగా
ధ్వజము నెత్తించియు ♦ విజయ మొప్ప
సాధుజనావళుల్ ♦ చక్కగా నివసింప
మందిరంబు లొనర్చి ♦ మహిమదనర
హరినామ స్మరణంబు ♦ ననుదినంబు నొనర్ప
హరిదాసులను నిల్పి ♦ నర్థమిచ్చి
యిదిగాక పెంపెచ్చిన ♦ దింకొక్కటియు నుండె
కవిరాజ నిర్మాణ ♦ కావ్యచయము
నచ్చు గూర్పింపగా ♦ నసమానమౌ ద్రవ్య
సాహాయ్య మొనరించు ♦ సద్గుణుండు

తే॥ గీ॥ కాన మత్కృతమౌ మోక్ష ♦ గ్రంథమైన
చక్రధారీశ శతకంబు ♦ శాశ్వతముగ
పుడమివర్ధిల్ల ముద్రణం ♦ బును నొనర్చు
నట్టి మీ కగు ఘనమైన ♦ నన్వయంబు
నుండగలదయ్యా రవిచందు ♦ లుండువఱకు
రామచంద్రుని కృపవల్ల ♦ రమ్యముగను.

ఇట్లు,

గ్రంథకర్త.

శ్రీకృష్ణ పరబ్రహ్మణేనమః.

భక్తిజ్ఞాన వైరాగ్య నీతిమార్గములుకల ప్రకరణము.

# చక్రధారి శతకము.

## ప్రథమ భాగము.

సీ॥ శ్రీజనార్దనశౌరి • సిరియు భూదేవియు
చేరియిర్వంకల • సేవజేయ
వాణీశ్వరుడుగొల్వ • వరశచీపతివేడ
శ్రీరతీపతిమ్రొక్క • శ్రీఘ్రముగను
సనకసాదులువచ్చి • సంస్తుతింపవిశేష
ఖేచరాదులువచ్చి • కీర్తినెన్న
మానివరులువచ్చి • మధురభాషలుబల్క
సాధువాదములెల్ల • సందడింప
లోకపాలురు మొదలు సు • శ్లోకులెల్ల
ప్రాకటంబుగ గొనియాడ • భక్తకోటి
కేవిపత్తులు రానీక • నెపుడుబ్రోచు
చక్రధారీశ్రితమనోబ్జ • చయవిహారి

సీ॥ మారజనక సురేశ • ద్వారపాలక శిక్ష
యదువంశభవపక్ష • యార్తరక్ష
ఫాలలోచన మిత్ర • నీలదేహపవిత్ర
కోటిభానువికాస • కోమలాంగ
ప్రమథగణాధీశ • ప్రకటగజానన
సంస్తుత్యపరమేశ • సార్వభౌమ
కార్తికేయహితేశ • కాలభైరవ త
వీరభద్రసుత • విశ్వరూప

ఘారగోవింద సకలేశ ♦ దాసపోష
నందనందన సుకుమార ♦ నగధరేశ
దురితహరణేశ మాంపాహి ♦ ద్వారరమేశ
చక్రధారిశ్రితమనోజ్ఞ ♦ చయవిహారి॥ 2

సీ॥ నిర్విఘ్నవృత్తికై ♦ నిజగజాననను నెంతు
వరశబ్దములకయి ♦ వాణి దలతు
ముద్దుపల్కులొసంగ ♦ ముక్కుతిమ్మన గొల్తు
నాంధ్రంబు రచియించు ♦ నల్లసాని
పెద్దనాహ్వయు కీర్తి ♦ పృథుభక్తివర్ణింతు
పోతాభిధానుని ♦ ప్రీతిగాంతు
కాళిదాసునిపాద ♦ కంజంబులు నుతింతు
తిక్కనార్యు స్మరింతు ♦ మిక్కుటముగ
వసుధ శ్రీకంఠుసేవలు ♦ వదలకెపుడు
సత్కృతు లొసంగవేయని ♦ సంతతమును
కోరి శతకంబొనర్చెద ♦ కోమరు మిగుల
చక్రధారిశ్రిత మనోజ్ఞ ♦ చయవిహారి॥ 3

సీ॥ కమలబాంధవ పుత్రు ♦ కరుణించినాడవో
విమలమార్గము దెల్పి ♦ విదురునింట
భుజియించితివిగదా ♦ భోగి తల్పశయాఢ్య
కమలనేత్ర వికాస ♦ కలుషనాశ
పవమాన సుతవంద్య ♦ పావనాంచితగాత్ర
సాగరాత్మజలోల ♦ సారసాక్ష
గాంధార పతితోడ ♦ బాంధవం బొనరించి
మగధరాజునుగూర్చి ♦ పగనుదీర్చి
రాజసూయాధ్వరంబును ♦ రాజులెన్న
ధర్మజునిచేత జేయించి ♦ తాల్మితోడ
సకల సామ్రాజ్య మిచ్చితో ♦ నరసులెన్న
చక్రధారిశ్రితమనోజ్ఞ ♦ చయవిహారి. 4

సీ॥ ముచికుందు రక్షించి ♦ మోక్షమిచ్చితిగదా
దినకర కులజాత ♦ దీనపోష
గోపిక లోకవంక ♦ ప్రాపునీవని గొల్వ
కాపాడితివిగదా ♦ కంజనయన
నీ పదాబ్జము నమ్మి ♦ యేపార గొలచిన
ద్రౌపది కభయంబు ♦ దడయకొసగి
సీరపాణినిగూడి ♦ మీరి యీజగమంత
పాలించితివిగదా ♦ పద్మనయన
పాపరాధుల శిక్షించి ♦ జగతి సకల
వర్ణధర్మము లెల్లను ♦ వరుసనుండ
గను నొనర్చితి నీవెగా ♦ ఘనముకుంద
చక్రధారీ శ్రిత మనోజ్ఞ ♦ చయవిహారి॥ 5

సీ॥ మునులభార్యలు దెచ్చు ♦ కొనిన యన్నముదిని
గోర్కెలు దీర్చిన ♦ గుణివినీవె
యతి ధైర్యమునదొచ్చి ♦ యా మడుగులోనున్న
కాళింగు ప్రాణముల్ ♦ గాచితీవె
విషము ధరించి బల్ ♦ మిషతోడ వచ్చిన
బూతకి జంపిన ♦ బుధుతవీవె
వినువీధి నేతెంచు ♦ ఘను తృణావర్తుని
బడగూల్చినట్టి బా ♦ లుడవునీవె
దీనతనువేడ బలిభార్య ♦ దిగులుమాన్పి
నరగలోకంబు జేర్చిన ♦ యోజ్జవీవె
వరగుణోద్దామ నిస్తుల ♦ వరదనీవు
చక్రధారీ శ్రితమనోజ్ఞ ♦ చయవిహారి 6

సీ॥ సర్వలోకములందు ♦ సాక్షాత్కరింపుచు
ద్వారకాపురిలోన ♦ జేరిదేవ
సంసారికైవడిన్ ♦ సంప్రపంచ దమునొంది
కంసుని హరియించి ♦ కరము మెరసి

వనమాలివైనీవు ♦ ననయంబు జగమందు
వేడ్క జనింపగా ♦ వెలసితౌర
భూభారమును బాపి ♦ స్వాభావికంబగు
పదము జెందితివయ్య ♦ పద్మనాభ
గోపచయమునకెల్లను ♦ గొదువలేని
యాదలబాపి నీకృప ♦ జూపినావు
ఎల్లసుజనుల ప్రేముడి ♦ నేలినావు
చక్రధారీ శ్రితమనోజ్ఞ ♦ చయవిహారి॥ 7

సీ॥ తాటకి దునుమాడి ♦ మేటివిశ్వామిత్రు
తోడనే యరిగిన ♦ తోయజాక్ష
గౌతమపత్నికి ♦ ఘనశాపమును బాపి
మిథిలాపురికి నేగి ♦ విధికృతముగ
పూజలగొనియంత ♦ భూతేశు చాపంబు
విరచి కీర్తినిగాంచి ♦ సరగ ద్రోవ
భార్గవుడెదురైన ♦ బాణంబుగొనివేగ
కరుణించి యంపిన ♦ కంజనేత్ర
వరుస సాకేతపురికేగి ♦ పరమసాధ్వి
జానకినిగూడి సన్మాని ♦ జనము బొగడ
పట్టభద్రుండవైతివో ♦ పరమభద్ర
చక్రధారీ శ్రితమనోజ్ఞ ♦ చయవిహారి॥ 8

సీ॥ అక్రూరునకు దేవ ♦ యఖిలంబు నీరూపు
జలములజూపిన ♦ సాధురక్ష
యాదవాద మధురకు ♦ నతివేగమున నేగి
ముందుజంపితివి నీ ♦ వందు రజకు
పటములన్నిధరించి ♦ పలుమారు బుష్పముల్
మాలికుడొసగగా ♦ మరియుదాల్చి
అలివేణివక్రంబు ♦ దిలకించి సరిజేసి
మదగజంబుల ద్రుంచి ♦ మగుడవచ్చి

ముష్టికునిఁగూల్చి చాణూరు ♦ నష్టపరచి
కడమ వైరుల ఖండించి ♦ కరము మెరసి
మేనమామను జెల్చిన ♦ మేటివీవె
చక్రధారీ శ్రితమనోబ్జ ♦ చయవిహారి॥ 9

సీ॥ పవమానతనయుండు ♦ లవణాబ్ధివడి జేరి
సీత సుక్షేమంబు ♦ స్థిరత దెల్ప
వానర బలముతో ♦ వడి లంక శోధించి
మూలబలంబుల ♦ కాలదున్మి
కుంభ నికుంభాది ♦ గంభీరులను ద్రుంచి
కుంభిని నీకీర్తి ♦ జృంభణముగ
శరణు జొచ్చిన మెచ్చి ♦ సరమనాథుని బ్రోచి
పౌలస్త్యుదును మాడి ♦ ప్రతిన జెలగ
నర విభీషణునకు లంక ♦ సరగ నొసగి
సీతగ్గొనియు నయోధ్య ♦ జేరితౌర
నీమహాత్వంబు నెన్నంగ ♦ నేర్తురెవరు
చక్రధారీ శ్రితమనోబ్జ ♦ చయవిహారి॥ 11

సీ॥ నీచక్రము ద్రిప్ప ♦ నీభక్తులకుగాక
నితరులకలవియే ♦ యిందిరేశ
నీమూర్తిదర్శింప ♦ నీ శ్రీకలకుదప్ప
పరులకు నలవియే ♦ యురగశయన
నీపదధ్యానంబు ♦ నిల్పినవారికి
నజ్ఞానరహితమా ♦ నమరవినుత
నీయోగదృష్టిచే ♦ నిఖిలంబు వీక్షింప
నీయందె మగ్నుడౌ ♦ నిర్మలాత్మ
దేవ నీకంటెనాకేది ♦ దిక్కుధరను
దీనమందార గిరిధర ♦ దితిజనాశ
నీలగిరివాస సర్వేశ ♦ నిర్జరేశ
చక్రధారీ శ్రితమనోబ్జ ♦ చయవిహారి॥ 11

సీ॥ గుహునిభక్తికిమెచ్చి ♦ బహుగాను కృపహెచ్చి
వరములిచ్చినతండ్రి ♦ పరమపురుష
ప్రకటించి ఖగరాజు ♦ జగతిలో నిన్నోర్చియ
సకల సౌఖ్యములిచ్చి ♦ సాకినావు
నాగరాజౌకసెజ్జ ♦ బాగుగానీకౌట
బాతాళపతిగాగ ♦ బంపినావు
జగమందు నీనామ ♦ జపమునుజేయంగ
వాణి వాక్కులనుండ ♦ వదలినావు
గుహాల మృగరాజులుండగా ♦ గూర్చినావు
మెరుపు నాకాశమందుంచి ♦ వరలినావు
పరమభక్తులు బ్రార్థింప ♦ బరగినావు
చక్రధారీ శ్రితమనోజ్ఞ ♦ చయవిహారి 12

సీ॥ వాలిసుగ్రీవులు ♦ వారన్నదమ్ములు
భాగంబుకోసమై ♦ బంతగించి
సమరంబుసేయంగ ♦ సర్వేశనీవప్డు
న్యాయంబు సుగ్రీవు ♦ నందుగలుగు
టెరిగియంతట రాజ్య ♦ మెలమితోనిప్పించి
వాలినిజతగూర్చి ♦ యతిరయమున
నన్యాయయుతుడైన ♦ యావాలిదునుమాడి
పట్టంబు సుగ్రీవు ♦ పాలుజేసి
అంగదునిగూడ నిప్పించి ♦ యాంజనేయు
తోడ సఖ్యంబునెరపించి ♦ తొల్లికపుల
కెల్ల హర్షంబుగూర్చిన ♦ నల్లనయ్య
చక్రధారీశ్రిత మనోజ్ఞ ♦ చయవిహారి॥ 13

సీ॥ దశకంఠుతలద్రుంచి ♦ పశుపతివిలునొంచి
విశ్వమందునకీర్తి ♦ వెలుగగాను
రాతినాతిగజేసి ♦ పాతకులవధించి
ప్రీతితోసీతను ♦ పెండ్లియాడి

పరశురామునిగర్వ ♦ భంగంబుగావించి
పరగనయోధ్యకు ♦ నరుగుదెంచి
రాజ్యంబుపాలించి ♦ రక్షించిప్రజలను
వీక్షించి కృపజూచి ♦ వెలయురామ
గరుడవాహన లక్ష్మీశ ♦ కమలనేత్ర
నేరమెన్నకనన్నుబ్రోవు ♦ మేరుధీర
రవికులోత్తమ రఘురామ ♦ రామరామ
చక్రధారీ శ్రితమనోబ్జ ♦ చయవిహారి. 14

సీ॥ శబరియేకులజాతి ♦ చక్కగాజూడంగ
వాల్మీకియేవంక ♦ వాడుధాత్రి
విదురునిస్థితియెద్ది ♦ వివరంబుగాగన
గంగాతనూజుడ ♦ నంగనెవడు
రాధాసతీసుతు ♦ ప్రకరణమెయ్యది
నారదుజన్మప్ర ♦ కారమెద్ది
సంజయుడేకుల ♦ సంజాతుడయ్యెనో
వ్యాసుని పుట్టుక ♦ దీసికనుడు
యిందరికి ముఖ్యముగుసేవ ♦ లందగానె
జాతినీతులవేమయ్యె ♦ జగతిజూడ
పరమసాయుజ్యమేకదా ♦ భక్తవరద
చక్రధారీ శ్రితమనోబ్జ ♦ చయవిహారి. 15

సీ॥ ఇనుమయస్కాంతము ♦ ననులీయమారీతి
హరిరాక కబ్జంబు ♦ లరయుభాతి
కుముదముల్ చంద్రుని ♦ గోరుచుండెడుమాడ్కి
కేకియామేఘుని ♦ రాకగోరు
భంగిజకోరముల్ ♦ బరగజంద్రునికళ
లాస్వాదనమొనర్చు ♦ నట్టిగతిని
మకరందముల్ గ్రోలు ♦ మదబంభరమురీతి
మగువప్రాణేశుపై ♦ మనసుగల్గు

నెఱులనాకును నీమీఁద ♦ నాసగలిగె
దీనపోషణ నెటుకడ ♦ తేరిచెదవొ
భ్రమరకీటక న్యాయంబు ♦ పగిదిధాత్రి
చక్రధారీ శ్రితమనోజ్ఞ ♦ చయవిహారి. 16

సీ॥ కోకిలపలుకుగా ♦ గూయునే వాయసం
బెంత కష్టించిన ♦ నిటునకైన
నాగాంతకునివలె కృ ♦ ష్ణాయన నేర్చునే
కొక్కురతనశక్తి ♦ కొలదికనిన
కలకంఠమనగూయ ♦ గలుగునే ఘూకంబు
శుకముతో బలుకునే ♦ చూడ క్రౌంచ
మునుభరద్వాజంబు ♦ భువిగూయునేరథాం
గమనేడి పక్షితో ♦ గలసిచటక
నెటులకౌజునుగూయునే ♦ యాయడేగ
మాలకాకులుగూయునే ♦ మహినెమళ్లు
కరణిసట్టులె పుణ్యులు ♦ కలుషమతులు
చక్రధారీ శ్రితమనోజ్ఞ ♦ చయవిహారి 17

సీ॥ విపినభూములనుండు ♦ వేదండములకేల
సుందరమాలికా ♦ నందతతులు
వృక్షాగ్రఫలములు ♦ భక్షించుకపులకు
మణిహారములవేల ♦ మరియుదాల్ప
చీకువానికిదేల ♦ షోకైనముకురంబు
కనిపించునేదాని ♦ గాంతియరయ
బధిరునకేటికి ♦ బల్మారుసత్కథల్
వినజాలునేవాని ♦ వీనులలర
మూకవానికి వేదంపు ♦ ముక్కలేల
షండునకుకామినీభోగ ♦ సరసమేల
కుజనునకు కీర్తిఘనమేల ♦ కుతలమందు
చక్రధారీ శ్రితమనోజ్ఞ ♦ చయవిహారి. 18

సీ॥ అజ్ఞానియెఱుగునే ♦ సుజ్ఞానమార్గముల్
నెఱిసమాధిప్రపూర్ణు ♦ డెఱుగుగాని
ఆలచస్తవయందు ♦ నంటియుండినయట్టి
దుగ్ధముల్ ద్రావునే ♦ దోడరిబిఱుదు
లవనిగొబ్బరి ఫలం ♦ బందలిసలిలంబు
ద్రాగగనేర్చునే ♦ సరగగపియు
కడుబృహన్నలుడయ్యు ♦ ఘనరాచకాంతల
గోరిరమించునే ♦ కొమరుమిగుల
నటువలెనె దేవనీరూపు ♦ నాత్మయందు
అంతరాత్మగనుండుట ♦ నరయలేక
చింతనొందెదరవనిలో ♦ చిత్రగతుల
చక్రధారీ శ్రితమనోజ్ఞ ♦ జయవిహారి. 19

సీ॥ బదరికాశ్రమమందు ♦ కుదురుగామునులకు
బోధించితివిగద ♦ పుణ్యచరిత
పంపాసరసియందు ♦ నింపొంద నరునితో
సల్లాపమాడితే ♦ నాశ్రమము
దండకాటవియందు ♦ నుంతుసన్మునులచే
నర్చనల్ గొంటివే ♦ యాదిదేవ
మధువనంబునకేగి ♦ మధుని ఖండించియు
తదనంతరము కణ్వ ♦ తపసితోడ
నిలచి ముఖ్యార్థములచెప్పి ♦ నీలగిరికి
బోయి యచ్చోట నివసించు ♦ ముఖ్యులకును
పరమమార్గంబుదెలిపిన ♦ ప్రభుడవీవ
చక్రధారీ శ్రితమనోజ్ఞ ♦ జయవిహారి. 20

సీ॥ పద్మాక్షయనినంత ♦ బాయును కలుషంబు
యచ్యుతాయనునంత ♦ నడగునఘము
వాసుదేవాయన ♦ వదలును వృజినంబు
సంకర్షణాయన ♦ సమయుభవము

పురుషోత్తమాయన ♦ బోవును దురితంబు
విశ్వరూపా యన ♦ విడుచునంహ
మరవిందనయనన్నా ♦ దరుగును పాపంబు
గోవిందయన్నను ♦ గూలుదుష్కృ
తమ్ము ప్రద్యుమ్న యనిన సౌ ♦ ఖ్యమ్ము సుమ్ము
కోరవమాలిన పలుకులు ♦ పలుక నేల
వెలుతె మిమ్మునర్పించి ♦ మొఱలిడక
చక్రధారీ శ్రితమనోబ్జ ♦ చయవిహారి. 21

సీ॥ చిగురాకుబోలిన ♦ సొగసగు నీయంఘ్రు
లామునిచయ హృద ♦ యములనుంచి
శతపత్రనయననీ ♦ యతుల సామ్రాజ్యంబు
సాగరాత్మజకిచ్చి ♦ సరసగతుల
దనరారు నీరూపు ♦ తగిన నిర్జరవర్గ
ములకొసంగితి వహో ♦ మోహనాంగ
పాముసెజ్జబిరాన ♦ పరమేష్టికి నొసంగి
తక్కిన వస్తువుల్ ♦ త్వరితగతిని
పాకశాసనునకునిచ్చి ♦ పరమభక్త
వరుల రక్షింప వేంచేసి ♦ వరములొసగి
తౌర నిన్నెన్నతరమె నీ ♦ యుర్వియందు
చక్రధారీ శ్రితమనోబ్జ ♦ చయవిహారి. 22

సీ. నందనందనుడవై ♦ గొందులు బహుదూరి
పొందుగోరితి వహో ♦ యిందుముఖుల
చిరుతప్రాయమునాడు ♦ గరితలందరిచేత
చేతులెత్తగజేసి ♦ చీరెలిడియు
వేణునాదంబూది ♦ విపినంబు జేర్చి యీ
లీలవత్తురె సిగ్గు ♦ మాలియనుచు
పరమాత్మ నీరూపు ♦ కరమర్ధిజూపక
నగుపడవైతివో ♦ నర్ధరాత్రి

చెలియలందరు నీపేరు ♦ చెప్పి బిలచి
సకల తరులార మాకృష్ణు ♦ జాడదెల్పు
డనిన గనుపించి తామీద ♦ ఘనతజూపు
చక్రధారీ శ్రితమనోజ్ఞ ♦ చయవిహారి. 23

సీ॥ కువలయేశ్వరవంశ ♦ ఘోరాటవినిగాల్ప
గోత్రామరులసొమ్ము ♦ గొనుటయగ్ని
భూపాలకుల నిజో ♦ భూతిసింధువణంచ
జ్యాసుత వి తమా ♦ జ్వలనసమము
విశ్వంభరేశుల ♦ విత్తమర్గ గిరిగూల్ప
యచలామరాళిద్ర ♦ వ్యముకులిశము
అవని సత్పతుల స ♦ మాఖ్య కౌముదిబాప
నుర్వీసురధనం బి ♦ నోదయంబు
ద్విజపటలి రుక్మమునకంటె ♦ విషముమేలు
బ్రహ్మపుత్రకు బ్రతికృతి ♦ వరలుగాని
దీని మాన్పంగ భువిమించు ♦ గానమధిప
చక్రధారీ శ్రితమనోజ్ఞ ♦ చయవిహారి. 24

సీ॥ నీలాంబరునిగూడి ♦ చాలవేడుకతోడ
విలసిల్లితివిగదా ♦ విశ్వనాథ
పీతాంబరముదాల్చి ♦ ప్రీతితో గొన్నాళ్ళు
క్రీడసల్పితివిగా ♦ కీర్తిశాలి
నరహరివై పృథ్వి ♦ సిరితోను బరతెంచి
యురము జీల్చితివిగా ♦ ధరను దైత్యు
వామనాఖ్యుండవై ♦ వసుమతినంతయు
వాసవుకిచ్చితౌ ♦ వారిజాక్ష
గిరిధరుడనైతివామీద ♦ కేశవాఖ్య
నీలగిరివాస పరమేశ ♦ నిర్వికార
ఘన కృపాసింధుమహాదేవ ♦ కమలనాభ
చక్రధారీ శ్రితమనోజ్ఞ ♦ చయవిహారి. 25

సీ॥ జ్ఞానోదయంబుచే ♦ మానునజ్ఞానంబు
హరిదశ్వచేతమం ♦ చణగుమాడ్కి
భృంగస్వరూప స ♦ ల్లింగ శరీరాఢ్య
సంగరజయరంగ ♦ సన్నుతాంగ
హృదయాంతరంగమై ♦ బదిలంపు హంసనై
విలసిల్లుచుండిన ♦ వేదవేద్య
చంద్రకళాధర ♦ శాశ్వతసన్నామ
రవిశశిలోచన ♦ రాజరాజ
అఖిలచారుగుణాకర ♦ నఘవిదూర
పద్మదళనేత్ర సుపవిత్ర ♦ బ్రహ్మమిత్ర
భక్తజనరక్ష యదురక్ష ♦ బంధమోక్ష
చక్రధారీ శ్రితమనోజ్ఞ ♦ చయవిహారి. 26

సీ॥ సాకేతపురికిని ♦ సరియేదిజూచిన
పరిఘులచిత్రంబు ♦ నరయవశమె
ప్రాసాదములసొంపు ♦ బరికింపనెవరికో
హరిదశ్వ కిరణము ♦ లందుజొరగ
ప్రాకారములలంబ ♦ మాకాశమునుదాకి
నిలువరించెనుగాద ♦ నేర్పుగలిగి
బురవీథులేవేళ ♦ బాలుపారజూచినక్
కస్తూరి మొదలుగా ♦ ఘనతరముగ
చందనాగరుఘనసార ♦ చారు వివిధ
ధరసుమందార సంపెంగ ♦ వరసుమముల
పరిమళంబులు నిత్యమై ♦ పాదుకొనుగ
చక్రధారీ శ్రితమనోజ్ఞ ♦ చయవిహారి. 27

సీ॥ ఏవంకజూచిన ♦ నావంకహరిదశ్వ
కిరణముల్ గనిపించు ♦ పరిఘులందు
ఏజాడజూచిన ♦ నాజాడ కేగెడి
ద్యుఘుణికాంతిచ్ఛాయ ♦ దొడరిమేడ

లందునన్ రాజిలు ♦ మందయానలద్యుతుల్
సవితృనితోడుత ♦ సమతనిలచె
నిలసుధాంశుని కళల్ ♦ చెలగికుడ్యములందు
గనుపించె బహుగను ♦ గరముమెరసి
వ్యాళమణివర్గమే సౌధ ♦ పాళిజెక్క
నరయ ప్రతిబింబితంబయ్యె ♦ నాపురమున
చిత్రచారిత్ర నీమహా ♦ చిత్రమహహ
చక్రధారీ శ్రితమనోజ్ఞ ♦ చయవిహారి. 28

సీ॥ ఆపురిలోగల్గు ♦ నధికసద్బ్రాహ్మల
సరిలేరుగా బ్రహ్మ ♦ సభలజూడ
నాపట్లమున రాజు ♦ లేపట్లమునజూడ
లేరుగా విలువిద్య ♦ లెక్కసేయ
నారాజధానిలో ♦ నైశ్వర్యములుగల
వైశ్యులఁ బోలిన ♦ వారులేరు
ఆనగరంబునం ♦ దలరు బ్రాహ్మణసేవ
సలిపెడు శూద్రులై ♦ చ్చటనులేరు
గరిమవేశ్యలబోలిన ♦ గరితలెవరు
లేరు చోరులు జారులే ♦ లీలగాన
నేరు యిదియంతె నీచిత్ర ♦ క్రమముగాదె
చక్రధారీ శ్రితమనోజ్ఞ ♦ చయవిహారి॥ 29

సీ॥ అలకముల్ఫాలంబు ♦ లంటకేలనుదిద్ది
అళులు పద్మాననం ♦ బందుబర్వ
భ్రమరపంక్తులుబాప ♦ బరువడిశుకములు
మోవికాంతిగ్రహించ ♦ మ్రోలకురుకు
చిలుకలదోలంగ ♦ చెలగినేత్రఝషంబు
లకు వియన్నది మను ♦ లోకటవరుగ
మీనముల్తోలుగగా ♦ మేలతతోరాయు
ఖరహొరుంగులుదన్ను ♦ గదసినిలువ

శంపలనుదోలు చక్రముల్ ♦ సరణినుండు
కుచగిరులుగల్గు కమలతో ♦ క్రీడసల్పు
సుజనమందారభుజగేంద్ర ♦ శయనప్రోవు
చక్రధారీ శ్రితమనోబ్జ ♦ చయవిహారి. 30

సీ॥ నూపురంబులరవం ♦ బోపజాలక పృథ్వీ
వరధైర్యమును పూని ♦ వడకెనహహా
కటకఘోషంబుచే ♦ గంపంబుధరగుండె
ఘనహారములుచంద్ర ♦ కాంతిజెందె
మేఖలసరములు ♦ మెరుగుకాంతులుబర్వి
కటిభాగమెల్లను ♦ గ్రమ్మిమరియు
కర్ణికాలంకారి ♦ వర్ణనల్ దిలకింప
నావిశేషునకైన ♦ నలవియగునె
గరిమెముక్తావళీదండ ♦ కరిమొయ
వరలలాటికధరియించి ♦ వామభాగ
మందుగూర్చున్న శ్రీనాథ ♦ ముందుప్రోవు
చక్రధారీ శ్రితమనోబ్జ ♦ చయవిహారి. 31

సీ॥ ఏవెల్గుగనుగొన్న ♦ నీవెలుగునకుబోల
గలదెశశినేత్ర ♦ కమలగాత్ర
ఏనామమునువిన్న ♦ నీనామతుల్యము
కేమున్నదేచూడ ♦ నిందిరేశ
ఏమూర్తిగనుగొన్న ♦ నీమూర్తితోసరి
వచ్చునే కాంచగ ♦ వసుధలోన
ఏధ్యానముననున్న ♦ నీధ్యానమునకీడు
జ్ఞానస్థలినిన్ లేదె ♦ కమలనాభ
ఎచటగూర్చున్న నిలుచున్న ♦ నెట్టులున్న
నడుచుచుండిన నీచింత ♦ నమ్రభావ
మునను వినుతించువారికే ♦ దనరుముక్తి
చక్రధారీ శ్రితమనోబ్జ ♦ చయవిహారి. 32

సీ॥ ఉత్తమజన్మంబు ♦ లోగిపుట్టినోకమూల
దుర్జాతికులులంత ♦ దోడరినారు
మీమాంసకులుక్షితి ♦ మెదలకనున్నారు
ఖండాలజాతకుల్ ♦ నిండినారు
వేదపాఠకులంత ♦ వెలవెలబోయిరి
వేదబాహ్యులునెల్ల ♦ వెలసినారు
పటుకవీశ్వరులెల్ల ♦ నెటులకోజనినారు
కుకవిజనంబులు ♦ గూడినారు
పరమసాధులు చింతల ♦ బరగినారు
యశవిహీనులు ధరనల ♦ రారినారు
కలియుగాశ్చర్యమిదియౌను ♦ కంతుజనక
చక్రధారీ శ్రితమనోబ్జ ♦ చయవిహారి. 33

సీ॥ జన్మమెత్తుటయు నీ ♦ జగతిలో దుఃఖంబు
బరునడి ముదిమియే ♦ బరమదుఃఖ
మామీద జాయతో ♦ నలరుటింకొకదుఃఖ
మవనిమరియు మరి ♦ నణగిమరియు
నిరతిసంసార సా ♦ గరములోపలజిక్కు
బడుటయు నొకదుఃఖ ♦ భరము క్షీర
వారిరాశిశయాన ♦ నీరజభూషితా
బాలగోపాల శ్రీ ♦ లోల నీమ
హాజ్ఞచే నిట్లులోకంబు ♦ లలరవలసె
జాగ్రతను దాను దెలివిచే ♦ జగమునందు
దెలియువారలు గణ్యులు ♦ దేవదేవ
చక్రధారీ శ్రితమనోబ్జ ♦ చయవిహారి॥ 34

సీ॥ తల్లిదండ్రులునాస్తి ♦ తత్సోదరులునాస్తి
బంధుజాలమునాస్తి ♦ భ్రమలునాస్తి
అర్థంబు మరినాస్తి ♦ యారామములునాస్తి
సకలలోకాలోక ♦ సమితినాస్తి

నత్తురా దేవ నీపాద ♦ పద్మ చింత
చక్రధారిశ్రిత మనోజ్ఞ ♦ చయవిహారి. 39

సీ. గోవిందరాజులు ♦ గొలుచుచు నిద్రించె
కొలపాత్రతల జేర్చి ♦ కొండయందు
వరదరాజస్వామి ♦ బరువడి గూర్చుండె
భక్తులు గొలువంగ ♦ భద్రగిరిని
శ్రీరంగనాయకుల్ ♦ చేరి శైలమునందు
సుస్థిరంబుగనుండె ♦ శుభము లొసగ
పార్వతీనాథుండు ♦ ప్రమథ గణాళితో
వేంచేసియుండె బల్ ♦ వేడ్కగలిగి
తగిన దేవతలందరా ♦ స్థానమునను
నొప్పుచుందురుగద కృత ♦ యుగమునందు
అహాహా కలియుగ వైకుంఠ ♦ మయ్యె నేడు
చక్రధారిశ్రిత మనోజ్ఞ ♦ చయవిహారి. 40

సీ. రామదాసునకు మేల్ ♦ రంజిల్లగ నొసంగ
నిచ్చిన చోటిదే ♦ యినకులేశ
హరిదాసు లేవేళ ♦ నాశిలోచ్ఛయమందు
తపము సల్పెదరుగా ♦ తథ్యముగను
త్రిదివవాసులువచ్చి ♦ దీర్థముల్ దగనాడి
నిలచిన క్ష్మాభృత్తు ♦ నెలవునదియె
తూము నృసింహుని ♦ జాములో కైవల్య
మును చేర్చితీనగం ♦ బుననుగాద
పరమపుణ్యాత్ము లాయద్రి ♦ భాగమందు
జన్మములు జేసి చనినట్టి ♦ శైలమదియె
దరమె వర్ణింప బ్రహ్మకేన్ ♦ ధరణిలోన
చక్రధారిశ్రిత మనోజ్ఞ ♦ చయవిహారి. 41

సీ. దశరథ సుతుడవై ♦ దండ్రి పంపున నేగి
నీపత్ని సౌమిత్రి ♦ నిన్నుగొలువ

దండకాటవిలోన ♦ నుండగానొక్క నా
డావనంబును బాసి ♦ యనుజతోడ
జనుచు నాత్రోవలో ♦ ఘనమైనశిలజూచి
దానిపై గూర్చుండి ♦ తన్వివీవు
యాయాసమంతయు ♦ నల్లనదీర్చుకగ
పాషాణమునుజూచి ♦ పలికితీవు
నీవలనమాకు సౌఖ్యంబు ♦ నెగడెనిపుడు
నీకు వరమిచ్చెదము మేము ♦ ప్రాకటగతి
మేలు చేసితివనిచాల ♦ ముదముగనవె
చక్రధారిశ్రిత మనోజ్ఞ ♦ చయవిహారి. 42

సీ॥ చిరకాలమున నీవు ♦ శిలరూపమును బాసి
మేరువ దేవికి ♦ మేరువకును
పుత్రుండనై పుట్టి ♦ పుడమిలో మిగులంగ
శిలరూపధారివై ♦ చెలగుమనుచు
నల రామదేవుండు ♦ నానతిచ్చియు నరుగ
నారీతి బహుకాల ♦ మరుగనతని
మేరువ దేవికి ♦ మేరువాహ్వయునకు
భద్రుండుగాబుట్టి ♦ భాసురముగ
తొల్లి జ్ఞానంబునన్ జేసి ♦ మొల్లమిగను
దాశరథిగూర్చి తగువేడ్క ♦ తపమొనర్ప
వార్త వినివచ్చి తౌరమేల్ ♦ వాసుదేవ
చక్రధారిశ్రిత మనోజ్ఞ ♦ చయవిహారి. 43

సీ॥ భద్రునకెదురుగా ♦ బహువేగమునవీవు
సీతమ్ముడును సీత ♦ ప్రీతినేగి
భద్రుని చేతను ♦ బహుమొక్కులనుగొని
కోర్కెలిచ్చెదనన్న ♦ కోరెనతడు
శ్రీరమానాయక ♦ శ్రీ గౌరిపతిమిత్ర
సింధుకన్యాలోల ♦ చిత్క్లేశ

నాయపరాధంబు ♦ నయముగా క్షమియించ
గయుని రక్షించుట ♦ గడుధృవంబు
నాకు సన్మోక్షంబు ♦ వీకనొసంగిన
నాజటాయువు బ్రోచి ♦ నది యదార్థ
మని యెఱింగెద మహిలోన ♦ నంతమూర్తి
సరగదూషణభూషణ ♦ నిరసనములు
తనువునకుగాని చూడ నా ♦ త్మకును లేవు
చక్రధారీ! శ్రితమనోజ్ఞ ♦ జయవిహారి. 49

సీ. వీడటే విజయుని ♦ తోడరిసారధిజేసి
పుడమినిప్పించిన ♦ పుణ్యమూర్తి
వీడటే చెరసాల ♦ లోడాగున్నృపతుల
విడిపించి తెచ్చిన ♦ విక్రముండు
వీడటే కంసుని ♦ విదళించి తనతల్లి
దండ్రి సంకెళలూడ్చు ♦ ధార్మికుండు
వీడటేపాకారి ♦ విక్రమంబునణంచి
పారిజాతముగొన్న ♦ పావనుండు
వీనిగన నట్టి జన్మంబు ♦ వృధయగాదె
వీనికధలాలకించని ♦ వీనులేల
ననిస్మరించరె మునునిన్ను ♦ నతివలెల్ల
చక్రధారీ! శ్రిత మనోజ్ఞ ♦ చయవిహారి. 50

సీ. నీమహాత్మ్యము రుక్మి ♦ ణీదేవి యెఱిగియు
నిన్ బరిణయమాడె ♦ నిరతినూని
నీవిశేష గుణాదు ♦ లేమి యెఱుంగక
శిశుపాలు డొకగ్రుద్దు ♦ చేతజచ్చె
నినుదూరి రుక్మియు ♦ ఘన పరాభవమును
బొందడే ధాత్రిలో ♦ బుణ్యచరిత
నీదివ్యమూర్తిని ♦ నిత్యమ్ము బూజించి
వినుతు డక్రూరుండు ♦ విజయమొందె

నీకు నుపకారములుజేసి ♦ వీకదైత్యు
లవనిగూలిరి మీచక్ర ♦ హరినినరయ
కొరతలుండునె నీభక్త ♦ కోటికెపుడు
చక్రధారీశ్రితమనోజ్ఞ ♦ చయవిహారి. 51

సీ॥ అంబరీషుడొనర్చి ♦ నట్టిద్వాదశివిందు
గుడువదూర్వాసుండు ♦ గొమరుమిగుల
జనుదెంచగనిరాజు ♦ వినయంబుగను మ్రొక్కి
స్నానంబొనర్చుము ♦ స్వామితాము
పారణకాలంబు ♦ పరగమించగగూడ
దదినావ్రతంబౌట ♦ నయ్యలేచి
త్వరగ వేంచేయుడు ♦ వరమునీశ్వరయన
నౌగాకయనినేగి ♦ యలజలంబు
నందు గ్రుంకియు రాకున్న ♦ నచటిబుధులు
మునివరేణ్యుడు రాడయ్యె ♦ ముఖ్యసమయ
మయ్యె తులసీజలంబుల ♦ ననఘునీవు
గొనినదోసములేదన ♦ గ్రోలెనృపుడు
చక్రధారీ శ్రితమనోజ్ఞ ♦ చయవిహారి. 52

సీ॥ దూర్వాసుడదియంత ♦ తోరమ్ముగనెరిగి
జలములలోనుండి ♦ చనిరయమున
నాకుబెట్టకనీవు ♦ నరనాధగుడిచితి
విదెజూడుచూపెద ♦ నీక్షణమున
ననిశక్తినిపిన ♦ నతడు శ్రీహరియంచు
మొరలిడ నీ చక్ర ♦ మును బనుపగ
తపసిభయంబంది ♦ తగవుగాబ్రహ్మకు
వినుపింప నాతండు ♦ విష్ణుచక్ర
మిపుడుదరమొకో మరలింప ♦ తపసిధీర
యంబరీషుని కడకేగు ♦ మతడునిన్ను
గావగలడనజనెనృపు ♦ కడకుమౌని
చక్రధారీశ్రితమనోజ్ఞ ♦ చయవిహారి. 53

సీ॥ ఓయంబరీషుని ♦ యుర్వీనసద్భక్తి
నెరుగకే జేసితి ♦ వినుతపనియు
నాతప్పు క్షమియించి ♦ నగధరుచక్రంబు
న్నాపైకి రాకుండ ♦ నాపివేయు
మన సంబరీషుడు ♦ మనమున హరిగూర్చి
కావవేయని వేడి ♦ కరుణరయమున
పాంచజన్యమనీకు ♦ పరగమొక్కదగాని
ఋషి చెంత కేగకు ♦ రూఢినసుచు

తాపసోత్తముడప్పుడు ♦ తతసుభక్తి
బలుకగావిని దుర్వాస ♦ భవ్యమౌని
సంతసించుచు తనఘనా ♦ శ్రమముజేరె
చక్రధారీ శ్రితమనోజ్ఞ ♦ చయవిహారి. 54

సీ॥ సభలోనద్రౌపది ♦ సద్వేణి చేబట్టి
యీడ్చు దుశ్శాసనుం ♦ డేమియయ్యె
గోష్పాదమంతటి ♦ గోత్రంబునివ్వక
ధార్తరాష్ట్రుండేమి ♦ ధరణినేలె
కీచకాధముడిది ♦ నీచమనుకొనక
సత్సాధ్విగోరియే ♦ సరణియయ్యె
వృపపాండవులజంపి ♦ యుర్విసశ్వత్థామ
డెట్టిదుర్గతినొం ది ♦ మెచటికరిగె

మానధనులైననేమి దు ♦ ర్మార్గమునను
కర్మగతి నిట్లు లెరిగా ♦ కనుగొనంగ
దేవశ్రీదేవదేవ యో ♦ దివ్యభావ
చక్రధారీ శ్రితమనోజ్ఞ ♦ చయవిహారి. 55

సీ॥ పురుహూతుగర్వంబు ♦ త్వరగా నణచిపుచ్చి
గోత్రంబు నేలిన ♦ గుణిపిగాడె
బరమేష్టిరాజసం ♦ బురువడినణగింప
గోపాల గోవుల ♦ గూర్చలేదె

కాళింగుగర్వంబు ♦ గడియలో హరియించి
మరిసాగరముచేర్చి ♦ మనుపలేదె
సంతాపమొనరించు ♦ సకలదుర్మార్గుల
నందరనచ్చట ♦ నణచలేదె.
వరదనీయండె గురిగల్లు ♦ వారలయిన
జనకజాభీష్మ ఘనకృష్ణ ♦ చాగసరుల
కడురయంబున దరిజేర్చ ♦ గావలేదె
చక్రధారి శ్రితమనోజ్ఞ ♦ జయవిహారి. 56

సీ॥ బాల్యమునుంచియు ♦ భక్తి సియంగసుంచు
ప్రహ్లాదు నేలిన ♦ పరమపురుష
బాల్యమిత్రుండన ♦ బరగుగుచేలుప
వాంఛలీడేర్చిన ♦ వారిజాక్ష
బంధుడుసఖుడునై ♦ బరగెడునర్జును
ననియందుగెల్పించి ♦ సిన మహాత్మ
శరణన్నయంత నే ♦ వరవిభీషణునకు
లంకనొసంగిన ♦ లలితరూప
అగ్రజునికోడి నీ యండ ♦ నాశ్రయించు
నర్కసుతుగాచినట్టి మ ♦ హానుభావ
మరియు నీ మహిమము నెన్న ♦ మాకుదరమె
చక్రధారి శ్రితమనోజ్ఞ ♦ చయవిహారి. 57

సీ॥ నారదుశాపంబు ♦ ననుకుబేరుని సుతుల్
మద్దులై పడియుండ ♦ మహినిజూచి
కృష్ణమూర్త్యాఖ్యచే ♦ నష్టమసుతుడనై
తల్లి నిరా కోటికి ♦ దగనుగట్ట
నదినీడ్చి మద్దుల ♦ గదిసినమాత్రాన
మద్దులందునగల ♦ మానివరుల
ప్రణతులు గైకొని ♦ పరగశాపవిమోచ
నంబొనర్చితివౌర ♦ నాగశయన

దేవ నీ చిహ్నాలన్నియుఁ ♦ దెలియవశమె
బాలుఁడవె నీవె బరికింప ♦ బ్రహ్మాదక్క
నితరుల కెటుగ శక్యమే ♦ యిద్ధతేజ
చక్రధారీ శ్రితమనోబ్జ ♦ చయవిహారి. 58

సీ. సగరపుత్రులుచాల ♦ జగదపకారులై
సవనాశ్వము నెవండు ♦ సంగ్రహింప
నరువదివేల వా ♦ రందరు మడిసియూ
భూమియూకాశంబు ♦ బూసగ వెదకి
యశ్వంబుగానక ♦ నంతటభూమిని
పాతాళమునకు ద్ర ♦ వ్వంగనచట
యున్మీలితాక్షుడై ♦ యొకముని గూర్చుండి
పరికించినాతని ♦ పజ్జనున్న
గుఱ్ఱమునుజూచి యీతడె ♦ గొనెనటంచు
కపిలమునియని దెలియక ♦ క్రమముదప్ప
గాను భస్మంబుజేసితౌ ♦ గమలనాభ
చక్రధారీ శ్రితమనోబ్జ ♦ చయవిహారి. 59

సీ॥ సంపన్నుడయిన రా ♦ క్షసుడు పౌలస్త్యుండు
నిరవ్వెంద సురలకు ♦ నెగ్గుసల్పు
చున్నవార్తలు విని ♦ క్రన్నన రక్షింప
దితిజుల శిక్షింప ♦ దేవనీవు
రామాకృతిధరించి ♦ రయమున నిద్ధాత్రి
పుత్రమిత్రభ్రాతృ ♦ భూతియుతము
లయిన బలముగల ♦ యాదురాగతునీచు
జంపిరాజ్యము నను ♦ జన్మునకిడి
భూమిలో పెక్కువేలేండ్లు ♦ బాల్పుమీర
త్రిదివవాసుల రక్షించ ♦ దివ్యముగను
జానకీపతివై వేడ్క ♦ జగతిబ్రోచు
చక్రధారీ శ్రితమనోబ్జ ♦ చయవిహారి. 60

సీ. లక్ష్మీశనీనాభి ♦ లలితమా పద్మసం
భవుడైన బ్రహ్మనిక్ ♦ భద్రముగను
పరికించిగానక • బల్విపాదము నొందు
చుండగా మరినీవు ♦ చూడ్కులకును
గోచరంబునుగాక ♦ గొమరొప్ప దశదిశల్
గంభీరనాదముల్ ♦ గడలుకొనగ
వినవాయి కుట్టాయి ♦ విశ్వంబునకునిన్ను
సృష్టికర్తను జేతు ♦ స్థిరముగాను
గానగాయాజ్ఞనూనుము ♦ క.. లగర్భ
జంతువుల జేయుచుండు మీ ♦ జగతియందు
ప్రాణుల సృజించుచుండు ప్ర ♦ పంచమందు
నీకుజయమగునని పల్కు ♦ నీరజాక్ష
చక్రధారీ శ్రితమనోబ్జ ♦ చయవిహారి. 61

సీ॥ కరిరాజువరద నీ ♦ చరిత నెరుంగక
ధాతసృష్టియొనర్చె ♦ భూతములను
ముచికుందవరదనీ ♦ రుచితోటి సరిరాక
కుముదవైరినభంబు ♦ గూడియుండె
కందర్పజనక నీ ♦ సుందరంబునుబోల
కను రతీపతిబోమె ♦ కాయముడిగి
సిరినాధనీకీర్తి ♦ సరిబోలజాలక
చందురుండు కళంక ♦ సహితుడయ్యె
యుదధి నీగుణములకును ♦ యోడిపోయె
నగము నీ ధైర్యమునకును ♦ నొగిలెనహహ
మరియు నీయోర్పునకుధాత్రి ♦ మట్టియయ్యె
చక్రధారీ శ్రితమనోబ్జ ♦ చయవిహారి. 62

సీ॥ సోమకాసురుదృంచి ♦ శోధించి వేదము
లజునకునిచ్చిన ♦ యాదిదేవ
గోత్రంబు మునిగిన ♦ గొమరొప్ప జలనిధి
లోపెకినె తిన ♦ లోకవంద్య

దితిసుతుహరియించి ♦ తివిరిభూచక్రంబు
పాదుగా నిల్పిన ♦ పద్మనాభ
కనకకశ్యపుగూల్చి ♦ కరమెుప్పప్రహ్లాదు
గాచిన నృహరివే ♦ ఘనముకుంద
వామనుడవయ్యు బలియొద్ద ♦ వసుధగొనిన
వాడవేరామ శ్రీరాము ♦ బారిబడిన
దాశరథివైతివౌగదే ♦ దానవారి
చక్రధారీ శ్రితమనోజ్ఞ ♦ చయవిహారి. 63

సీ॥ గోపాలకుల యిండ్ల ♦ కును గొబ్బునను నేగి
బలకృష్ణమూర్తులై ♦ బరగినారు
నందయశోదల ♦ మందిరమ్ముల వెన్న
ముద్దలన్నియు మ్రింగి ♦ మురిసినారు
గోష్టములనుజొచ్చి ♦ గోవులన్నిటిగాంచ
గోపకాంతలచెల్మి ♦ గోరినారు
మధురాపురికి నేగి ♦ మాయచే కంసాది
దుష్టులనందరి ♦ ద్రుంచినారు
ధర్మమార్గముబూనరించి ♦ దనరినారు
సాధుబాధల దీర్చగా ♦ జాలినారు
ధరనుభారంబు హరియించి ♦ వరలినారు
చక్రధారీ శ్రితమనోజ్ఞ ♦ చయవిహారి. 64

సీ॥ పరమేష్టివరముచే ♦ బరగ శ్రీకౌసల్య
పుత్రరత్నంబవై ♦ భూతలమున
వరయశ్వమేధముల్ ♦ వరుసగాగావించి
భూరిదానములిడి ♦ భూసురులకు
శత్రుఘ్నభరత ల ♦ క్ష్మణసోదరత్రయ
చేతదిగ్విజయంబు ♦ జెందిమిగుల
పూర్వరాజులబోలి ♦ సర్వకాలముక్షోణి
నీవయేలితివిబల్ ♦ నేర్పుమీర

వరవసిష్ఠాదులెల్లను ♦ వచ్చిగొలువ
రాజసూయాధ్వరంబును ♦ రమణతోడ
జేసితివిగద శ్రీరామ ♦ చిత్రకామ
చక్రధారీ శ్రితమనోబ్జ ♦ చయవిహారి. 65

సీ॥ మానవాకృతితోడ ♦ గానలో విహరించి
దానవానీకమ్ము ♦ దరిమినావు
భువిపదునొక్కటి ♦ బొసగినవేలేండ్లు
బరిపాలనముతోడ ♦ బ్రబలినావు
బాల్యమునుండియు ♦ బల్మి చేష్టలనొప్పి
భాసురాకృతుడవై ♦ పరగినావు
కౌమారముననుండి ♦ కడుయుక్తులను నేర్చి
బ్రహ్మాదులను మించి ♦ పరగినావు
ధర నెన్న గొన్నాళ్ళు ♦ వరసతీమణిగూడి
లవకుశులనుగని ♦ లలితవిధుల
తల్లులందున పరిచర్య ♦ దప్పకెప్డు
వర్ధిలగజేసితౌగదే ♦ వారిజాక్ష
లోకనాథుడవై కీర్తు ♦ లొందినావు
చక్రధారీ శ్రితమనోబ్జ ♦ చయవిహారి. 66

సీ॥ శ్రీహరిపాద సం ♦ సేవ లేమారడు
జీవవస్తువులు త్య ♦ జించుగాని
వరవైష్ణవుని భక్తి ♦ మరువకుండునుగాని
దేవేంద్రుపదవి కే ♦ తేరజనడు
కోమలాంగునితోడ ♦ గూడియుండునుగాని
కుజనుల చెల్మిని ♦ గోరబోడు
జలజాక్షుపదచింత ♦ జెలగిజేయునుగాని
యన్యవిషయముల ♦ కరుగబోడు
మధురిపునితోడి మాటాడి ♦ మరలుగాని
మానవులతోడ మాటాడ ♦ మనసుగొనడు

అలవియే దెల్ప ప్రహ్లాదు ♦ నతులకథలు
చక్రధారీ శ్రితమనోబ్జ ♦ చయవిహారి. 67

సీ॥ తనలోనె హరిజూచి ♦ దరహాసమును జెందు
హరియందె జగమున్న ♦ దనితలంచు
తనలోనె సిరినాథు ♦ దగవసింపగజూచు
దనయందె సర్వంబు ♦ దానుమరచు
తనలోపల నెచక్ర ♦ ధారియుండుటజూచు
తనయస్థిరత నెంచు ♦ మనమునందు
దనుజారితనయందె ♦ దాగియుండుటజూచు
దనుజారి తానేక ♦ మనితలంచు

వస్తుభేదంబు లేదని ♦ బ
సట్టి ప్రహ్లాదు బ్రోచుట ♦ యతిశయంబె
కొన్నవిల్కాని గన్నయ్య ♦ నన్ను బ్రోవు
చక్రధారీ శ్రితమనోబ్జ ♦ చయవిహారి. 68

సీ॥ హరినీకు పాన్పగు ♦ నాదిశేషుడుసదా
గాలినే భక్షించి ♦ గడుపుచుండు
సర్వేశనీకుల ♦ సద్వాహనంబైన
పన్నగారి మెసవు ♦ పన్నగముల
బరువడి నీ పుత్రు ♦ డురుసృష్టి యొనరించి
తరుగులేకుండడే ♦ ధనమునకును
నీకాంత శ్రీలక్ష్మి ♦ నిరతంబువరుసగా
దినము పేరంటంబు ♦ దిరుగలేదె

నీదుమనమందు చరియించు ♦ నెరిజగంబు
నీకుకే ఖర్చు లేదయ్యో ♦ నిత్యమనని
నీవు భక్తులయిండ్లలో ♦ నిలతువెపుడు
చక్రధారీ శ్రితమనోబ్జ ♦ చయవిహారి. 69

సీ॥ ఖర్చుగలాడవే ♦ కమలాక్షయొకతరి
బ్రహ్మాండములకును ♦ బ్రభుడవౌట
పరివారమునకును ♦ బట్టను బహువిత్త
మిలవిప్రులకు దక్షి ♦ ణలనొసంగ
గనుజాలెదవు ధాత్రి ♦ గుఱుతింపచతురంగ
బలములకేబట్ట ♦ బహుధనంబు
ఆర్తజనావళి ♦ యతిశయముగ వేడ
నర్థమంతయునిత్తు ♦ వపుడె దేవ
సంశయింపవుసత్కృపా ♦ శాలివౌట
కొరతలున్నవె నీభక్తి ♦ కోటికెల్ల
ధనపతివిగాదె లక్ష్మిదా ♦ పునను లేదె
చక్రధారీ శ్రితమనోజ్ఞ ♦ చయవిహారి. 70

సీ॥ నరనాథ నీనామ ♦ స్మరణకు మిగిలిన
దేమున్నదే జూడ ♦ నింపుగాను
పరమేశ నీపాద ♦ పద్మంబులర్చించు
పదవికన్నమిన్న ♦ పదవియేది
శ్రీచిత్తచోర నీ ♦ చెల్మికన్నను ధాత్రి
వేరెమేలగుచెల్మి ♦ వెదుకనేది
మాధవనీకథా ♦ మాధుర్యమునుగ్రోలు
సాధనంబేదియ ♦ నాథనాథ
సత్ఫలరసవర్గంబు ♦ సమముగావు
విమలచరిత భవత్పదా ♦ బ్జమధురిమకు
హస్తిమశకాంతరంబని ♦ యనగవచ్చు
చక్రధారీ శ్రితమనోజ్ఞ ♦ చయవిహారి. 71

సీ॥ దురితాటవులకాల్చ ♦ నిరతంబునీసేవ
కన్నను మరియేది ♦ కమలనయన
విషయాగ్ని కీలలు ♦ విరుగజేయుటకును
మిథ్యాసకును వేరు ♦ మిగులగలదె

సీ. వాగ్విభూషణమన ♦ వర్ణించిపలుకుట
శ్రోత్రభూషణమన ♦ సొంపువినుట
హస్తభూషణమన ♦ కర్చనల్ సేయుట
చక్షుర్భూషణమన ♦ చెలఁగఁగనుట
ఆత్మభూషణమన ♦ నానంద మొందుట
శీర్షభూషణమన ♦ సిరతమనుట
చరణభూషణమన ♦ సరగ సుస్థానంబు
నకుఁ బ్రదక్షిణమౌగు ♦ సకలవిధుల
విషయభూషణములనంగ ♦ నింది కేశ
యితర భూషణచయముల ♦ నొందుఁబోల
గలవు జగతియు మఱియు నే ♦ కరణిఁజూడ
చక్రధారీశ్రితమనోజ్ఞ ♦ చయవిహారి. 77

సీ. శర్కరరసమును ♦ చాలఁబోసియుఁ బెంచ
విషముమానునె ముష్టి ♦ విద్రుమమును
క్షీరసాగరములో ♦ చెలఁగికాకముముంచ
ధవళంబులెక్కకు ♦ దసరనగునె
కస్తూరిగంధంబు ♦ కడునడిసలనా
వృశ్చిక గరళంబు ♦ విరిగిపోనె
వెదురుబద్దలతోడ ♦ కుదియించికట్టిన
శ్వానవాలంబు తా ♦ చక్కనౌనె
మంచిమార్గంబు తెల్పిన ♦ మహినిదెల్ప
నడవిమూర్ఖున కివియేల ♦ ననిహసించు
వాని వానికి జతగూడ ♦ నౌనుగాక
చక్రధారీశ్రితమనోజ్ఞ ♦ చయవిహారి. 78

సీ॥ సుఖదుఃఖములరెంటి ♦ చొరవును దెలియక
గానకోని జరిపితి ♦ కొన్నినాళ్లు
నతికిల్బిషమనక ♦ నన్యకామినులపై
గోర్కెలుంచితిగదా ♦ గొన్నినాళ్లు

హంసలు లేనట్టి ♦ యాసరోవర మేల
పికశుకంబులు లేని ♦ విపిన మేల
ధరనధిపు పాలనము లేని ♦ ధాత్రి యేల
దినమణి సుకాంతులొప్పని ♦ దివస మేల
సరవిహారి సంస్మరణ లేని ♦ జన్మ మేల
చక్రధారి శ్రితమనోజ్ఞ ♦ చయవిహారి. ౮౨

సీ॥ కట్టించితివిగాదె ♦ ఘనజలానిధి మధ్య
ద్వారకాపురమును ♦ దాని నొకటి
గొట్టించితివిగాదె ♦ గోమునొప్పదశకంఠు
నరుసశిరంబులు ♦ వానిజాత
గాల్పించితివిగాదె ♦ గహనపుఖాండవవనం
బాముహేంద్రుమనిగుండె ♦ నాటెలుసుంగాల
జీల్పించితివిగాదె ♦ కెలరి నిక్కి సిసోమ్ము
నరనఖంబులచేత ♦ వాసుదేవ
దరిమితివిగాదె బలి క్రిందు ♦ దానవార
ద్రొక్కితివిగాదె గాళింగు ♦ నొక్కకాల
మెక్కితివిగాదె మాగడల్ ♦ మిక్కిలిగను
చక్రధారి శ్రితమనోజ్ఞ ♦ చయవిహారి. ౮౧

సీ॥ సిరి యేల నిలుచుని ♦ ధరణిలో నొకచోట
సర్వమందుననుండు ♦ సాధ్వగాన
వరప్రభంజననాము ♦ డిరవొంద నొకచోట
నుండు నా సర్వమం ♦ దుండుగాని
మరివీతిహోత్రుండు ♦ చురుచునాయొకచోట
లర్చులరగువర ♦ కపనిబోవు
భానుండు దీప్తుల ♦ బరపిముజ్జగమందు
తనలోనసకీడ్వడె ♦ దనరిమరియు
అటువలె నేనీవు గాన్పించి ♦ యందరికిని
కళలు నీలోనికినిగుంజ ♦ కర్మగతుల

వెంబడిని జన్మ మొందింతు ♦ వేసురేశ
చక్రధారీ శ్రితమనోజ్ఞ ♦ చయవిహారి. 83

సీ. నీటిలోపలనున్న ♦ నూటితామరకునీ
రంటనిచందాన ♦ నఘవిదూర
మట్టియందు జరించు ♦ మహికులాలపుబుర్ర
నకులోష్ణమంటని ♦ నాణెముగను
చింతగుల్లలనుండు ♦ చింతపండునకును
బొబ్బరంటనిరీతి ♦ బోసగ భువిని
శుద్ధస్ఫటికమున ♦ శోణంబునిల్పిన
శోణమంటనియట్లు ♦ పూనికగను
నుదధిలోనుండు జలచర ♦ ముదధినెరుగ
నట్లునీవును సర్వంబు ♦ నందునిండి
యంటి అంటనివిధమున ♦ నలరెదీవు
చక్రధారీ శ్రితమనోజ్ఞ ♦ చయవిహారి. 84

వనవిహంగములను ♦ వసుధ నెవ్వడుబ్రోచె
వ్యాఘ్రయూథంబునె ♦ వ్వండుగాచె
చెలులగర్భముల బి ♦ డ్డల నెవ్వడుమనిచె
చే నెవ్వడు ♦ పసులకొసగె
చెట్లులోకప్పకు ♦ సాదమెవ్వడొసంగె
చీమకెవ్వడుబోసె ♦ చెలగనూక
వృక్షజాతినెవండు ♦ వృద్ధినిబొందించె
సకలమ్ము నెవ్వడు ♦ సాకుచుండె
దేవనీదైన సంకల్ప ♦ భావమునను
నిట్టులగుచుండె గాకలే ♦ దేనియెవరు
పోషణమ్ము నొనర్తురు ♦ ముజ్జగముల
చక్రధారీ శ్రితమనోజ్ఞ ♦ చయవిహారి. 85

మృగతృష్ణలనుజూచి ♦ మొనసిమూర్ఖుడునమ్మి
జలమనుకొని చేర ♦ జనినయట్లు

హాటకసూత్రంబు ♦ పాటవంబుగదాల్చు
కోటిమన్మథరూప ♦ గోత్రధార
పరమపవిత్రమై ♦ బరగుయజ్ఞోపవీ
తంబుదెచ్చితిని దే ♦ దాల్చుమిపుడు
మణులు జెక్కిన పతకంబు ♦ మరియుదాల్చు
సిరి వెనకగూడి చక్రంబు ♦ చెలగిదాల్చు
మణుల కుండలములునిత్తు ♦ మహినిదాల్చు
చక్రధారిశ్రితమనోజ్ఞ ♦ చయవిహారి. 88

సీ॥ కౌసల్య తనయ నీ ♦ కస్తూరి తిలకంబు
ఫాలమందున దిద్దు ♦ లాలితముగ
ఘనసారయుతమైన ♦ గంధ చందనంబును
మృగనాభి యగరును ♦ సొగసుగుల్కు
మందారసుమముల ♦ యందలి పరిమళ
ములను మిశ్రితమైన ♦ యలసుగంధ
మును నుత్తమాంగ మం ♦ దుంచ లేపనము జేతు
కోరిక దీరగ ♦ కూర్మితోడ
సుగటి పీచెద నీ దేహ ♦ సుఖముకొరకు
మునుల హృదయము నను నిల్వ ♦ ముదముతోడ
మణుల పాదుకలునుదాల్చు ♦ మరియు నివిగో
చక్రధారిశ్రితమనోజ్ఞ ♦ చయవిహారి. 89

సీ॥ రావెరమాపతి ♦ రాజీవదళ నేత్ర
బూజ సల్పెద నీకు ♦ భూమినాథ
మందారజాజికా ♦ మల్లికాచంపక
కరవీర కేసరి ♦ కనకపంక
జాకుందవరబృంద ♦ చారుమాధవబిల్వ
పున్నాగపరిమళ ♦ పుష్పచయము
తెల్లనుదగదెచ్చి ♦ నిందిరాధవనీకు
పూజలు సేయంగ ♦ బూనినాను

సీ. నవనీతచోర నీ ♦ యుపసర్పనైవేద్య
మునకుగా నిప్పుడు ♦ మొనసి చాల
యరటిపండ్లును ద్రాక్ష ♦ వరచూతఫలములు
ఖర్జూర వెలగయు ♦ కరమునింక
నారికేళంబులు ♦ నానీయుమా చెఱ్కు
తేనెయు బెల్లంబు ♦ దివ్యమైన
ఘనసారయుతములు ♦ కెర మొప్ప సమకూర్చి
పేర్లైన ఘనరసా ♦ మృతము మఱియు
పక్వఫలరసవర్గముల్ ♦ పేర్మి నిడితి
సరగ గొనుమవె యోదేవ ♦ సగుణభావ
సుగుణజనపక్ష నన్నేలు ♦ మగుణశిక్ష
చక్రధారీ శ్రితమనోజ్ఞ ♦ చయవిహారి. 93

సీ. రాజాన్నమిదె మహా ♦ రఘురామ రణభీమ
యారగించను రావె ♦ సారసాక్ష
కూష్మాండ వార్తాక ♦ గురుశాక పాకముల్
సూపంబు రుచ్యమౌ ♦ చోష్యములును
నింగువ గలసిన ♦ రంగైన జీరతో
దధ్యన్నమును గ్రోలు ♦ తధ్యముగను
ఆలపాల్ శర్కర ♦ యేలాసమేతమౌ
పరమాన్నము భుజించు ♦ పద్మనాభ
వడ లతిరసలాది ♦ భక్ష్యముల్ నేతితో
వండి తెచ్చితి నిదే ♦ పరమపురుష
భార్యలిద్దరు నీవు నా ♦ భక్తి మెచ్చి
భోజనంబును జేయుడీ ♦ బాందుమింగ
నిక్కువను నాకొసంగవే ♦ ముక్తి వేగ
చక్రధారీ శ్రితమనోజ్ఞ ♦ చయవిహారి. 94

సీ. ఉత్తరాపోశన ♦ మెత్తవే మునివంద్య
పట్టవే వ్యామాంబు ♦ బరగ నీవు

చరణయుగంబును ♦ నిరవొంద గడగికో
యిదిగో మందాకినీ ♦ యిద్ధగంగ
శుద్ధాచమూనంబు ♦ నిద్ధాత్రిలో జేయు
దారాపథాంబువుర్ ♦ దముకొసగితి
కర్పూరహారతుల్ ♦ కరమొప్పనిచ్చితి
మంత్రిపుష్పంబిదె ♦ మధురభాష
తెల్లనాకులు పోకలు ♦దివ్యమగు ల
వంగములు జాజికాయ జా ♦ పత్రిపచ్చ
కపురముంగల వస్తువుల్ ♦ కలిగినట్టి
తమలమిదె దెచ్చితినిగొను ♦ దయను దేవ
చక్రధారీశ్రితమనోజ్ఞ ♦ చయవిహారి. 95

సీ. పాన్పు వేసితినయా ♦ పాకశాసనమిత్ర
పవళింపరమ్మిక ♦ పద్మనాభ
మీయద్దలోత్తును ♦ మెలతలిద్దరునిల్చి
యుండిరి నిద్రించు ♦ మోము మురారి
బహుపరాకులు దెల్ప ♦ భటతతులుండిరి
బరువడి మేల్కాంచు ♦ భక్తవరద
సకలవిద్వజ్జన ♦ సముదయంబుండెను
సంస్తుతింపగ దేవ ♦ సభ యొనర్చ
నిన్నునమ్మినభక్తుల ♦ నెమ్మిబోచు
నటులనన్నును దయనేలు ♦ మమరవినుత
మంగళంబులు నీకగు ♦ మాపురేపు
చక్రధారీశ్రితమనోజ్ఞచయవిహారి. 96

---

శ్రీ భగవద్గీతా ప్రకరణము.

సీ. చినిగినచేలముల్ ♦ పనికిరావనిమాని
క్రొత్తపటంబులు ♦ గొమరుమిగుల
నరులుధరించిన ♦ కరణినసమ్యగ్యతి
పరమాత్మ నీరీతి ♦ పాదుగాను

జీర్ణశరీరముల్ ♦ జెలువారవదలియు
క్రొత్తశరీరముల్ ♦ కూర్మితోడ
పొందుచుండునుగాదె ♦ పొలుపొంద జగమందు
సర్వేశ నినుజాల ♦ సంస్తుతింతు
నాత్మకును చావులేదప్పు ♦ డరసిజూడ
తనువునకుగాని మరణంబు ♦ ధరణిదీని
నెమ్మి నెరిగినవాడె పో ♦ నీశపరుడు
చక్రధారి శ్రితమనోజ్ఞ ♦ చయవిహారి. 97

సీ. అవనీశ్వరా చూడ ♦ నన్నమందున బ్రాణు
లుద్భవించెనుగాదె ♦ నుదధిశయన
కమలాక్షకనుగొన ♦ కడు ప్రసాదమునందె
వృద్ధిశ్రవుడు బుట్టె ♦ విదితముగను
యిందిరాపతిగాంచ ♦ నిల యజ్ఞములయందు
క్రతుభుజుండు జనించె ♦ గరముమీర
మాధవ కనుగొన ♦ మరియధ్వరమునందు
కర్మముద్భవమయ్యె ♦ కనుగొనంగ
విశ్వరక్షణ మీరీతి ♦ వివరమొప్పు
చుండగను బ్రాంతివలనను ♦ నుర్వియందు
యజ్ఞములు నీవెయాద్యంత♦మరయనీవె
చక్రధారి శ్రితమనోజ్ఞ ♦ చయవిహారి. 98

సీ. ధర ప్రయత్నము లేక ♦ తనయంతటనె వచ్చు
వస్తు వెద్దైనచో ♦ వలయునపుడు
వర సుఖదుఃఖముల్ ♦ మరియు శీతోష్ణముల్
సమముగా దలచుచు ♦ స్వాంతమునను
పరులయెడఁ ద్వేష ♦ పడక ముదంబుతో
గార్యసిద్ధియునైన ♦ గాకయున్న
సర్వసముండయి ♦ సంచరించెడివాడు
గర్మముల్ జేసినఁ ♦ గమలనాథ

బంధముల బొందడయ్యు యో ♦ భక్తవరుని
ముందు మీదాసుడగుటకు ♦ ముఖ్యుడిదియె
గద పరాత్పర భువనేశ ♦ కంతు జనక
చక్రధారి శ్రితమనోబ్జ ♦ చయవిహారి. 99

సీ. విద్యయందునను స ♦ ద్వినయ సంపన్నత్వ
ములను రెండిటి సమం ♦ బుగ దలంప
విప్రుని యెడగాని ♦ సలయ గోవులయందు
సామజంబైనను ♦ సరిగ దలప
శునియందునను గాని ♦ శునిని వండుకతిను
ఛండాలునెడ గాని ♦ సమత దలప
బడినవారైరేని ♦ బరికింప బండితుల్
సమదర్శనులుగారె ♦ సకలమందు
నిత్య సౌభాగ్యములు బొంది ♦ నిన్ను జేరి
కీర్తి కాములునౌచుంద్రు ♦ కినుకవీడి
వరశుభాకారలక్ష్మీశ ♦ వాసుదేవ
చక్రధారి శ్రితమనోబ్జ ♦ చయవిహారి. 100

శ్రీరామచంద్ర పరబ్రహ్మణే నమః.

శ్రీ భగవద్గీతల ప్రకరణము.

# చక్రధారి శతకము.



## ఉత్తర భాగము.

---

సీ. ఉచితమౌ నాహార ♦ ముచితసంచారంబు
నుచిత కర్మలచేత ♦ నొప్పువాఁడు
నుచితపరిశ్రమం ♦ బుచితసంసారంబు
యుక్తచేష్టలచేత ♦ నొప్పువాఁడు
తగినంతనిద్రయుఁ ♦ దగినంత మెలకువ
యును గడునోర్పుతో ♦ నొప్పువాఁడు
దుఃఖంబులోలసం ♦ తోష మనస్కుఁడై
యోగమార్గంబున ♦ నొప్పువాఁడు
తే. దేవ నీలోన నైక్యమై ♦ తేజరిలెడు
నరుఁడొకో చూడ వైకుంఠ ♦ పురనివాస
నేను నటువలె గానెంచి ♦ నానుతింద్రి
చక్రధారీ శ్రితమనోజ్ఞ ♦ చయవిహారి. 1

సీ. అన్యచింతలు లేక ♦ ననిశంబునా భక్తి
నే జనావళి కూడి ♦ యింపుపెనర
సేవింపుచున్నారొ ♦ చెలగి వారలయొక్క
సంబంధమును నేను ♦ చాల గోరి
నిత్యంబు బోషించు ♦ నిరతిమై భాసిల్ల
బగవడిజేరుస ♦ బ్భారమంత

మునుకొని తాల్లునం ♦ చని భగవద్గీత
యందు బల్కగలేఁ ♦ నందతనయ
అల్లనీ నామమరలేక ♦ ననవరతము
దలచెదను నీదు ప్రతినను ♦ దప్పకయ్య
వరసురాధీశ గోవింద ♦ వాసుదేవ
చక్రధారీ శ్రితమనోజ్ఞ ♦ చయవిహారి. 2

సీ. పత్రంబు పుష్పంబు ♦ బరగ ఫలంబును
దోయంబునైనను ♦ దోడరనాకు
భక్తితో నొసగిన ♦ బరగంగ వారికే
ముక్తినిచ్చెద నేను ♦ ముఖ్యముగను
నొక పుష్పమేగాని ♦యొక ఫలమేగాని
యొక పర్ణమేగాని ♦ నొనర జలము
నైన నాకొసగిన ♦ నలగు సద్బుద్ధిచే
చిరకాలమును వాని ♦ శిలగి బ్రోతు
పరమభక్తులు నాకును ♦ పరగసఖులు
దనరు వారికి నాకు భే ♦ దంబు లేద
టంచు బల్కితి వహాహ ని ♦ న్నరయ నశను
చక్రధారీ శ్రితమనోజ్ఞ ♦ చయవిహారి. 3

సీ. శత్రువందుననైన ♦ మిత్రునందుననైన
సముడైనవాడెపో ♦ సద్గుణుండు
మానమందున నవ ♦ మానంబునందున
సమభావుడెవ్వడు ♦ సరసుడతడు
శీతోష్ణములయందు చెలగి సమత్వము
దలచినవాడెపో ♦ ధన్యతముడు
సుఖదుఃఖములు రెండు ♦ సొరిదినొంటిగ జూచు
నాతడే ధారుణి ♦ నతిసుజనుడు
భార్యయందును సుతులందు ♦ భ్రమయ లేక
సంగవర్జితుడైనని ♦ స్సంగిగాడె

దేవ యీావృత్తులకునీవె ♦ గావె తెలప
చక్రధారి శ్రితమనోబ్జ ♦ చయవిహారి. 4

సీ. దూషించినను గాని ♦ భూషించినను గాని
సమతజూచెడి ప్రకా ♦ శముగలాడు
మానంబుగలవాడు ♦ మరియెట్టివసువె
ననులభించినదృప్తి ♦ దనరువాడు
హృదయపద్మముదక్క ♦ నితరసలములెవ్వి
యును లేనివాడుగా ♦ నున్నవాడు
స్థిరమైనబుద్ధిచే ♦ నిరతమొప్పెడువాడు
భక్తియుక్తుండయి ♦ ప్రబలువాడు
నిట్టివాడెసుమీనాకు ♦ హితుడు ప్రియుడ
టంచు మోక్షంబునొసగిన ♦ యచ్యుతుడవు
భక్తవత్సలమొక్కెద ♦ భవవినాశ
చక్రధారి శ్రితమనోబ్జ ♦ చయవిహారి. 5

సుఖదుఃఖములు రెంట ♦ సొంపొందసముడయి
బంగారమునురాయి ♦ పరగమృత్తి
కలయందు సమబుద్ధి ♦ వెలయించుటలుగల్గి
యిష్టంబులకును న ♦ నిష్టములకు
సమభావముననుండి ♦ సర్వాత్మకుండయి
ప్రకృతికవశ్యుడై ♦ ప్రకటమయిన
పరమాత్మసిద్ధుడై ♦ పాదుగాంచినవాడు
నిందజేసినచాల ♦ గుందకవని
నుండువాడును భూషింప ♦ నుర్వియందు
బొంకకుండనివాడును ♦ బొల్పుమీర
సమమనస్కులు జ్ఞానులు ♦ సాధులరయ
చక్రధారి శ్రితమనోబ్జ ♦ చయవిహారి. 6

సీ. వృష్టిపుంగవులను ♦ త్కృష్ణుడగనొప్పి
వాసుదేవాఖ్యచే ♦ బ్రబలుచుండి

పాండవులందున ♦ బరగధనంజయు
డనునామకుడవౌచు ♦ నవనిమెరసి
మునినేత శ్రీవ్యాసు ♦ డనగ్రాలుచుంటివి
కవులలోనుశనస ♦ త్కవివయితివి
దండులలోదండ ♦ ధారివై తివిభువి
మౌనులలోమహా ♦ మౌనుడవైతి
వఖిల సుజ్ఞానులందు నే ♦ రందియుంటి
వహమునే నైతిగాదెయీ ♦ యవనిలోన
నన్నిరూపములేనైతి ♦ ననిన దేవ
చక్రధారిశ్రితమనోజ్ఞ ♦ చయవిహారి. 7

సీ. క్షరుడక్షరుండన ♦ గరము వెల్గుచునుండ్రు
క్షరుడు సంసారియ ♦ క్షరుడుముక్తు
డననొప్పువారిలో ♦ ననయంబు క్షరుడైన
ప్రకృతిచేగల్గు నా ♦ ప్రాణులకును
బద్ధాత్ముడైయుండె ♦ బదపడి జగమందు
ప్రకృతినిమానిన ♦ బరగయక్ష
రుండుకూటస్థుడై ♦ రూఢిముక్తుడనంగ
విలసిల్లుచుండిన ♦ విశ్వరక్ష
కుడవు శుద్ధాత్మకుండవు ♦ కువలయమున
నీవుదక్కనికెవ్వరు ♦ నిశ్చయముగ
సాకి రక్షించనయ్యె నకే ♦ సారసాక్ష
చక్రధారిశ్రితమనోజ్ఞ ♦ చయవిహారి. 8

గంధవహుండును ♦ గంధాంశములుగల
కస్తూరియునునాది ♦ గాగచిన్ని
యవయవములగూడి ♦ యలరుపరిమళమును
స్వీకరించుచుగడు ♦ శీఘ్రమేగు
నట్టులనీయాత్మ ♦ నవనివిచారింప
నేశరీరమునుండి ♦ యెటకుజనునొ

యేశరీరమ్ముదా ♦ నిలనాశ్రయించునో
యటకును సూక్ష్మేంద్రి ♦ యములదీసి
కొనిపోవ గలవాడు ♦ కొమరొప్పజీవుండు
నిదిసిద్ధమా గాదె ♦ యిందికేశ
మరణమే నిశ్చయంబంచు ♦ మదినెరిగి
పుట్టుగిట్టులు లేనట్టి ♦ గుట్టుదెలసి
అట్టివారికి సుకృతమ ♦ త్యధికమయ్య
చక్రధారిశ్రితమనోజ్ఞ ♦ చయవిహారి. 9

సీ. జయజయరఘురామ ♦ జయజానకీరామ
జయపరంధామపి ♦ జయసునామ
జయతుభార్గవరామ ♦ జయభక్తహృద్ధామ
జయపరాక్రమభీమ ♦ చారుధామ
జయసంగరోద్దామ ♦ జయజగదభిరామ
జయమయోధ్యారామ ♦ శౌరినామ
జయతుమేఘశ్యామ ♦ జయకపిహృద్ధామ
జయకూర్మధరరామ ♦ జయసురామ
జయకులోద్ధామ శేషాద్రి ♦ శయనరామ
జయతుపూతనహరరామ ♦ సదయకామ
జయజయసునీమ మాంపాహి ♦ జయనమోస్తు
చక్రధారిశ్రితమనోజ్ఞ ♦ చయవిహారి. 10

సీ. భగవదారాధన ♦ బాటించిజనములు
సరగనొసర్చిన ♦ జన్నమందు
శిష్టాశనంబున ♦ చెలగినశేషంబు
బ్రాజ్ఞులుభుజియింతు ♦ రందువలన
నాత్మసుజ్ఞానము ♦ నందికర్మలవీడి
పరమాత్మనుజెంది ♦ బరగుచుండు
తననిమిత్తంబయి ♦ తనరబాకము జేసి
భక్షణజేసిన ♦ భ్రష్టులవని

పాపమును బొందుచుందురు ♦ బలువిధముల
పరగ నీ కర్పణముజేసి ♦ ప్రస్తుతించి
తదుపరి భుజించువారలె ♦ ధన్యులిలను
చక్రధారీ శ్రితమనోజ్ఞ ♦ చయవిహారి. 11

సీ. దేహమందున్న యీ ♦ దివ్యమానాత్మకు
బాల్యకౌమార యౌ ♦ వనములింక
వృద్ధత్వములు నెట్లు ♦ పృథ్విలో దిలకింప
పురుషునకుండు న ♦ ప్పొల్కడనరు
బుద్ధిమంతులు మన ♦ స్సిద్ధులై సతతంబు
మోహమ్ముగాంచరు ♦ ముఖ్యముగను
యొండమావులవంటి ♦ యీ శరీరమునమ్మి
కన్నులుగానక ♦ కఠినజనులు
దుర్గతికి బోవగలరయ్య ♦ భక్తమిత్ర
వాసుదేవుండవౌ నిన్ను ♦ వదలకుండ
గొలచువారికె మోక్షంబు ♦ కోమలాంగ
చక్రధారీ శ్రితమనోజ్ఞ ♦ చయవిహారి. 12

సీ. పుట్టినవారికి ♦ గిట్టుట యెపుడయిన
నిశ్చయంబౌగదా ♦ నిర్వికల్ప
చచ్చినవారికి ♦ జగతిలో జన్మంబు
తప్పక కలుగుగా ♦ దానవారి
సకల జీవంబులు ♦ స్థావరంబుల
నా దేహమందుండు ♦ నాత్మ యెప్పు
డును జంపబడదని ♦ ఘనముగా సద్బుధుల్
బరికింత్రు ధాత్రిని ♦ బద్మనాభ
యిద్ది తెలియక నరులు దుః ♦ ఖించుచుంద్రు
పామరులు దక్క తక్కిన ♦ ప్రాజ్ఞులెల్ల
వింతజేయుచునుంద్రు నీ ♦ చిత్కళలను
చక్రధారీ శ్రితమనోజ్ఞ ♦ చయవిహారి. 13

సీ. ఎప్పుడెప్పుడునైన ♦ నెలమినధర్మంబు
నకు వృద్ధిధర్మంబు ♦ నకును చాల
హానివచ్చిననప్పు ♦ డవనిలో బ్రతియుగ
మందు పుట్టుచునుందు ♦ ననుచు బలికి
నాడవంచనివధా ♦ న్యాసు గీతలుపల్కె
వినగల్గితిమిగాదె ♦ ఘనులలరి
మదమున వర్తిల్లు ♦ మనుజాసురులబట్టి
ఖండించితౌగాదె ♦ కరము మెరసి
నిన్నుగాంచిన చింతల ♦ న్నియును దీరు
నిన్నుజూడని కన్నులు ♦ కన్నులగునె
నీకు నంజలిజేయని ♦ వేకరములె
చక్రధారీ శ్రితమనో ♦ జ్ఞ యవిహారి. 14

సీ. యోగంబుతోగూడి ♦ యోగులై విలసిల్లు
చున్న మానవులాత్మ ♦ యొప్పకొరకు
ఫలమునందాపేక్ష ♦ బడకయు విడనాడి
కాయంబుచేతను ♦ కరము మెరయు
మనసుచేతను చాల ♦ మంచి బుద్ధులచేత
కేవలేంద్రియ పంక్తి ♦ చే వెలయుచు
కర్మముల్ జేయుచు ♦ నిర్మలమూర్తులై
విజ్ఞానులన నొప్పు ♦ విశ్వమందు
కీర్తి జెన్నొంది పరమయో ♦ గయన వరలి
నిరతమును నీకు దాసులై ♦ నీదుసేవ
లెపుడు జేయుచునుండుట ♦ యే ఘనంబు
చక్రధారీ శ్రితమనో ♦ జ్ఞ యవిహారి. 15

సీ. యోగమందుండియు ♦ యోగ భ్రష్టుండైన
వాడు బుణ్యము జేయు ♦ వారి లోక
మందున బహుకాల ♦ మతి సౌఖ్యముననుండి
మరల మనుష్య జ ♦ న్మంబునెత్తి

శుచిచేదనరు పరి ♦ శుద్ధ మనస్కుల
గృహసీమలందు వ ♦ర్తిల్లుచుంద్రు
రటులకాదేని యో ♦ గాభ్యాస నిరతుల
యిండ్లలోనైన జ ♦ నించుచుంద్రు

పూజలందుచు నవ్వారు ♦ పుణ్యచరిత
ఓదయానందభావ మ ♦ హానుభావ
దైత్యసంహార నరసింహ ♦ దాసపోష
చక్రధారీ శ్రితమనోబ్జ ♦ జయవిహారి. 16

సీ. సర్వప్రపూర్ణుండు ♦ సర్వజ్ఞుడగువాడు
నర పురాతనుడన ♦ బరగువాడు
జగముల నిర్మించు ♦ శక్తి గల్గినవాడు
అణువుకంటెను సూక్ష్మమైనవాడు
పూర్ణభావంబున ♦ పూర్ణలక్ష్యమువాడు
మహిమలలో మహా ♦ మహిమువాడు
అరయశక్యముగాని ♦ హాసముగలవాడు
దివ్యస్వరూపుడై ♦ తిరుగువాడు

తలప నాదిత్యవర్ణంబు ♦ దాల్చువాడు
ప్రకృతికనిమీదిభాగమై ♦ పరగువాడు
నీవెగాక నికెవ్వరు ♦ నిరుపమాన
సర్వమును నీవయై మహి ♦ సాకుచుందు
చక్రధారీ శ్రితమనోబ్జ ♦ జయ విహారి. 17

సీ. నాయందె చిత్తంబు ♦ నాయందె బుద్ధియు
సతతంబునలయించు ♦ నతడె ఘనుడు
నాయందె ప్రాణంబు ♦ నాయందె ధ్యానంబు
నతిభక్తి నిల్పిన ♦ యతడె గురుడు
నానార్థముల నేర్చి ♦ నానాశ్రమల కోర్చి
ఇతరుల కెరిగాచు ♦ నతడధికుడు

నాథభక్తియే జీవ ♦ నమ్ముగ యోచించు
చుండునాతం డెపుడు ♦ హర్షోన్నతుండు
నన్ను నమ్మినవాడవి ♦ జ్ఞానయుతుడ
టంచుగీతలలో బల్కు ♦ వామహాత్మ
ఆది మధ్యాంతరహితబ్ర ♦ హ్మాండవినుత
చక్రధారీశ్రితమనోజ్ఞ ♦ చయవిహారి. 18

సీ. అజ్ఞానమున బుట్టు ♦ నట్టి తామసమును
గురుపాద సేవచే ♦ కొమరు మిగిలి
పరిపూర్ణమైనవ్య ♦ భాసురమ్మై వెల్గు
జ్ఞానదీపాగ్నిచే ♦ గాల్చివేసి
విషయంబులందుండి ♦ విషయమంటనిభాతి
దేహంబు నందుండు ♦ దేహివిధము
వేరైనభంగిని ♦ వెదకినమనుజుండు
జీవన్ముక్తుండన ♦ వెలుగుచుండు
నతనికే చూపపులోకి ♦ మనుజ్ఞాని
నితరులకు గల్గ నేర్చునే ♦ యిందిరేశ
భారతీనాథ సంసేవ్య ♦ భక్తవరద
చక్రధారీశ్రితమనోజ్ఞ ♦ చయవిహారి. 19

సీ. అర్జునక్లేశంబు ♦ నణగించ హరినీవు
దివ్యగంధంబును ♦ భవ్యసూనాలి
కలనుధరించియు ♦ కరమపాకృతమైన
లేపనంబుల తోడ ♦ నీల వసరి
హేమాంబరంబులు ♦ హేమకిరీటంబు
హేమరథంబును ♦ నిద్ధరూపు
గలిగిన సర్వైశ్వర్య ♦ కరముగా దిశలందు
నన్ని ముఖంబులై ♦ యవతరించి
బహుళ చరణంబు లక్షులు ♦ బహుగదాల్చి
సర్వసచరా చరంబంత ♦ సమతనిండి

విశ్వరూపంబు జూపిన ♦ విశ్వనాథ
చక్రధారీ శ్రితమనోజ్ఞ ♦ చయవిహారి 20

సీ. దైవవశంబునఁ ♦ దనకు లభించిన
యన్నాదులనుదృప్తి ♦ గన్నవాఁడు
మాయను దిగనాడి ♦ మహనీయ చిత్తుఁడై
యాత్మ స్వరూపంబు ♦ నరయువాఁడు
దృఢనిశ్చయుండయి ♦ పృథుశాస్త్రములయందు
జెప్పినకరణిని ♦ జేయువాఁడు
నాయందు బుద్ధిమ ♦ నంబునంతయుగూడ
దగసమర్పణజేసి ♦ తనరువాఁడు

పరమభక్తుఁడనందగు ♦ వాఁడెహితుఁడు
వాఁడెమిత్రుండు పుత్రుండు ♦ వాఁడెప్రియుఁడు
వానినేవీడ నంటివే ♦ వారిజాక్ష
చక్రధారీ శ్రితమనోజ్ఞ ♦ చయవిహారి. 21

సీ. ప్రాణిసంగమునకు ♦ బరగ జ్ఞానముగల్గి
హృదయస్థమైయుండు ♦ పదిలముగను
నాదుసంకల్పంబు ♦ ననుమానవులజాల
నియమించుచునుమహా ♦ నిపుణమతిని
నాచేతనుకీయును ♦ నాచేతశాస్త్రంబు
నాచేతసిద్ధియ ♦ నయముగలుగు
వేదంబులును నేనె ♦ వేదాంతమును నేనె
వేదంబునేనెత ♦ ద్వేదఫలము

నేనెయైవెల్గుచున్నాఁడ ♦ నిశ్చయముగ
నన్నిటిఁ దెలియ దగిన ♦ నన్న నేనె
యనుచు దెలిపితి వంటనీ ♦ వర్జునునకు
చక్రధారీ శ్రితమనోజ్ఞ ♦ చయవిహారి. 22

సీ. అవనీశ పరికింప ◆ నాశలనెడి యుచ్చు
త్రాళ్లలో జిక్కిరి ◆ ధాత్రిజనులు
షడ్వర్గచయముల ◆ సంపాదనమొసర్చి
భోగార్థములగని తూగువారు
వలనొప్పమరియు ష ◆ డ్వర్గంబులనెచాల
ముఖ్యంబులని బసూ ◆ మురియువార
లన్యాయ మెంచక ◆ నతిరుచియని పర
ధనము గోరెడివారు ◆ ధరణిగలరు
కోరెదరుగాని కోర్కెలు ◆ కొండగైన
ముక్తిమార్గంబు జేరెడి ◆ ముఖ్యగతిని
తెలియరైరి గదాజనుల్ ◆ దేవదేవ
చక్రధారీ శ్రితమనోజ్ఞ ◆ చయవిహారి. 23

సీ. దేవసద్విప్రులక్ ◆ దివిరి పూజించుట
గురువుల ప్రాజ్ఞులక్ ◆ గొల్చుచుంట
తీర్థయాత్రాదుల ◆ దివిరి సేవించుట
నిష్కపటంబుగా ◆ నెగడుధనము
నార్జించుకొనుట నీ ◆ యవని పరస్త్రీల
తల్లులటంచని ◆ దలచుచుంట
మనవంటి ప్రాణమే ◆ యనిదయతో జీవ
హింసచేయక యుంట ◆ నిధియునెల్ల
తనువుతో జేయబడినట్టి ◆ తపములనుచు
జెప్పిరి గదాస్మృతులలోన ◆ జెలగుసటుల
కోసలాధీశ గోవింద ◆ కువలయేశ
చక్రధారీ శ్రితమనోజ్ఞ ◆ చయవిహారి. 24

సీ. ఏనుధనికుడను ◆ నేను కులీనుండ
లేరునాకు సమాను ◆ లారయంగ
నేనొసంగెడివాడ ◆ నేనుతగినవాడ
చెలువుగా యజ్ఞముల్ ◆ జేయువాడ

సీ. అభ్యాసమునకంటె • నరయ జ్ఞానమ్ము మే
లంతకంటెను ధ్యాన • మరయ మేలు
ధ్యానయోగముకంటె • దనరకర్మత్యాగ
మును జూడ మేలౌను • మునుకొనికన
త్యాగంబు వీడినక • జగమునందున నొప్పు
గలిగియుండునుగాదె • ఘనతరంపు
విషయసంబంధంబు • విడిపోవనైయ్యుండ
శాంతమ్మెగనిపించు • సర్వజగము
ఘనఫలేచ్ఛలు లేనట్టి • కారణమున
సత్క్రియకర్మయె శ్లాఘింప • నేనటంటి
సన్నికర్మలు నీవెగా • యవనిదలప
చక్రధారీ శ్రితమనోజ్ఞ • చయవిహారి. 30

సీ. మాయయనగ పేరుచే • మహినినశ్వత్థంబు
విలసిల్లుచుండెను • వివిధగతుల
అజ్ఞానమును వేరు • లధికంబుగా గూడి
పాదుకొన్నవిగాన • పడకనిలచి
గుణసంగమంబులే • గొనకొని యీచెట్టు
నకు మూలమై యొప్పు • ప్రకటితముగ
యీపాదపంబున • కెలమి నాశము జూడ
సంగపరిత్యాగ • శక్తిగాదె
కాన ప్రకృతియె మాయయగా • ఘనదృఢమతి
సంగరహితంబుగల్గిన • భంగమొదవి
మొదలితోగూలునదె ముక్తి • సదయహృదయ
చక్రధారీ శ్రితమనోజ్ఞ • చయవిహారి. 31

సీ. అవని వైశ్వానరుం • డనగ నేనై యొప్పి
సకల హృదయమ్ముల • సరగనిలచి
వాయుపంచకముతో • వడిపరగుచునుండి
వృత్తి భేదంబుల • వెలయుచుండ

గూడుకొనినయట్టి ♦ వాడన్నె యన్నంబు
ఁలుగువిధముల ♦ బోలగాను
జీర్ణించు భావంబు ♦ జెలగి జేయుచునుందు
స్థిరబుద్ధి నేనన ♦ కరముమెఱసి

ఖాద్యమును చోష్యలేహ్యంబు ♦ గాకమఱియు
పేయమునుగూడ నీనాల్గు ♦ ప్రీతికరము
లైన విధములతోడనే ♦ నధికరుచుల
పచనమును జేయునన ప్రుక్కో ♦ పద్మనాభ
చక్రధారీ శ్రితమనోజ్ఞ ♦ చయవిహారి. 32

సీ. ధరనర్కతేజంబు ♦ బరునడి శశితేజ
మివికెంపునావియూ ♦ నెలమిదలచ
పీతిహోత్రజ్వాల ♦ పినరింపనాదయ్యె
విశ్వమండంతటకా ♦ శాశ్వతముగ
నీకళలిమ్మంచు ♦ నెరియన్నిశశిభాను
లకుగనిచ్చితి నేను ♦ కడుముదమున
పరయనాశక్తిచే ♦ నఖిలవస్తువులెల్ల
సృజియింపుచుంటిని ♦ సురుచిరముగ

కలువలకు చలికాడన్నై ♦ పలువిధముల
ప్రోషధులనెల్ల బండింతు ♦ నోజ్జనగుచు
సర్వమేనంచు బోషించ ♦ సముచనన వె
చక్రధారీ శ్రితమనోజ్ఞ ♦ చయవిహారి. 33

సీ. ఆత్మ నేననెడివా ♦ డవనిలో నేత్రశ్రో
త్రఘ్రాణచక్షులు ♦ దనరునటుల
స్పర్శేంద్రియము లైదు ♦ సరిగ మనసునుగూడి
యారునై విల ♦ సిల్లునట్టివీని
వశతనుజీవుండు ♦ విశదమా శబ్దాది
విషయంబులెల్లను ♦ వేడ్కజెలగ

ననుభవించునుగాదె ♦ యరయఁగా బరమేశ
నీవెయ్యెతివిగాదె ♦ నిర్మలముగ
దెలియ నధ్యాత్మకుఁడవీవె ♦ తేటపడఁగ
బరగ జిద్రూపివౌదీవె ♦ భక్తవరద
యరయ బ్రహ్మంబు నీవెయౌ ♦ యజ్ఞభోక్త
చక్రధారి శ్రీతమనోజ్ఞ ♦ చయవిహారి. 34

సీ. శమముదమముగెందు ♦ సాగి బాహ్యేంద్రియం
బంతరింద్రియములం ♦ చలరుచుండు
వాటినిగ్గించుట ♦ వలనొప్ప విషయాదు
లను హరించుటయును ♦ ఘనతరముగ
శాస్త్రసిద్ధమ్మునైన ♦ శాస్త్రీయకర్మముల్
పదపడిజేయుట ♦ పలువిధముల
పరులుబాధించినన్ ♦ బాధయంచెన్నక
పక్షపాతము లేక ♦ బరగునట్టి
విధముగాపె బ్రాహ్మణ ♦ విషయమనని
నీ వెగావారి బాలింప ♦ నీలదేహ
భక్తమందార పరమేశ ♦ భయవిదూర
చక్రధారి శ్రీతమనోజ్ఞ ♦ చయవిహారి. 35

సీ. అన్నంబు లఘువుగా ♦ నారగించుచునుండి
ప్రజలు లేనట్టిచో ♦ బరగువాడు
మనసు వాక్కు శరీర ♦ మను మూటి నియమించి
యంతయు నేక ♦ మంచరయువాడు
నిజయోగమార్గమే ♦ నెలవుగాగలవాడు
జగమున శాంతము ♦ సాకువాడు
జీవానురూపమే ♦ భావింపనాయంశ
మని యెల్లరకు ♦ చాటునట్టివాడు
సమర మానవతనువుల ♦ నలరియున్న
యింద్రియంబులచేత లా ♦ గించువాడు

నీవెగాడవెట యోదేవ ♦ దేవదేవ
చక్రధారీ శ్రితమనోజ్ఞ ♦ చయవిహారి. 36

సీ. పరుల కేకష్టంబు ♦ బరగ సల్పనిదియు
సతతంబు నిజమునే ♦ చాటునదియు
ప్రేమతోడను మంచి ♦ ప్రియమైన వాక్యముల్
బల్కుటయును వేద ♦ పాఠమొనర
జేయుటయు నిర్విప్ర ♦ స్థిరవాగింద్రియం
బుగ జేయుతపమని ♦ భూరిశాంతి
గోపంబులేకను ♦ గానకొని యితరుల
వృద్ధినిగోరుచు ♦ బుద్ధిలోను

సనర వాగింద్రియంబులే ♦ ఘనమనస్సు
టంచుధ్యానంబు ♦ నాపయునలర చేసి
యునదగితము ... యనునో ♦ యుజ్జ్వమునను
చక్రధారీ శ్రితమనోజ్ఞ ♦ చయవిహారి. 37

సీ. అర్జునా తెల్పెద ♦ నాత్మార్థమునునీకు
యీశ్వరుడిదె సకలవా ♦ డిచ్ఛచేత
యంత్రరూపంబుగా ♦ నలుపు దేహంబుపై
నున్న భూతములను ♦ పన్నుగాను
సత్వరజస్తమో ♦ సగుణత్రయాత్మక
మాయచేనిమ్మహి ♦ మరలద్రిప్పు
చుండుభూతములందు ♦ నొప్పిదంబై నేను
హృదయంబులందుండు ♦ నీప్సితమున

ప్రీతినేకాదశాధ్యాయ ♦ గీతలందు
నంతనామయమనిని వె ♦ యనగలేదె
అట్టినిన్నెన్నదరమ నా ♦ కమరనాథ
చక్రధారీ శ్రితమనోజ్ఞ ♦ చయవిహారి. 38

## భక్తిమార్గ ప్రకరణము.

సీ. వయసుగాయుండును ♦ వసుధముప్పనిశోచి
పరప్రభుత్వవిభూతి ♦ వలసమించి
తోలుకరిమెరుపుల ♦ వలెజూచితనువుల
దనయీడువారలి ♦ ధరణిలోన
తనకంటెముందుగా ♦ తగ్గిపోవుటజూచి
తాను జచ్చెడికాల ♦ తతియుగాంచి
కడుమోహపాశబ ♦ ద్ధుడయి మెదలలేక
పడియుండుగాదెయో ♦ పరమపురుష

ఇట్టి నరునకుసుకృతము ♦ దెట్టులబ్బు
దాశరథినిక హృదయవిధి ♦ దలచువాని
జన్మమేజన్మయని చెప్ప ♦ జనునుగాదె
చక్రధారి శ్రితమనోజ్ఞ ♦ చయవిహారి. 39

సీ. హాటక కలుషంబు ♦ నవనిశుద్ధినొనర్ప
ననలంబు దరికొల్పి ♦ యందుపైన
బుటముబెట్టియు నాద ♦ భూరిసువర్ణంబు
మాలిన్యరహితమై ♦ మరియునొప్పు
నట్టులెవరు దేహ ♦ మందుండు దుర్విష
యాదులనన్నిటి ♦ బాదుగదల
జేసినాశంబొన ♦ ర్చిన పూర్ణభావుడై
నిన్నుగనుంగొన ♦ నేర్చు తండ్రి

గనుకనక పరిపూర్ణమా ♦ కరుణజూచి
ఘనపదాంభోజ పీయూష ♦ మునదనుపుచు
దాసునిగ నేలుకోవయ్య ♦ ధన్యచరిత
చక్రధారి శ్రితమనోజ్ఞ ♦ చయవిహారి. 40

సీ. ఊహాపోహలను నే ♦ నుర్వీమర్త్యకమున్నె
లలివాతకఫముల ♦ లమకమున్నె

నీపదధ్యానంబు ♦ నే జేయ నేర్తునో
జేయజాలనొ తండ్రి ♦ శ్రీయనంత

దానికిప్పుడె నిన్ను చిం ♦ తనము జేతు
కృపను నాపయి జూపుమో ♦ శ్రీరమేశ
పాపచయనాశ విదళిత ♦ ప్రకటపాశ
చక్రధార్యాశ్రితమనోజ్ఞ ♦ చయవిహారి. 43

సీ. ఘంటాసురుండను ♦ కథలాలకించంగ
నెంచక హరిని వం ♦ చించ నెంచి
ఘంటికానినదముల్ ♦ కర్ణరంధ్రముల కే
బవలు జొరకనుండ ♦ నలయునంచు
శాసించి మెచ్చి ని ♦ శాటగోత్రజునకు
వరము నీయగ లేద ♦ సరగ భవుడు
సతతంబు నిను నమ్ము ♦ సద్భక్తులకు వరం
బులొసంగు టేమాత్ర ♦ పుబ్బనియగును

తండ్రి సుతుబోషణము జేయ ♦ దలచకున్న
నింక నెవ్వరు దిక్కు ర ♦ క్షించ నీవె
యార్తిబాపగ నీవె దే ♦ వా మహాత్మ
చక్రధార్యాశ్రితమనోజ్ఞ ♦ చయవిహారి. 44

సీ. తరణికులేశనా ♦ తప్పులన్ని క్షమించి
నీకటాక్షంబును ♦ నెరపవలయు
నందులకై యిప్పు ♦ డతిభక్తి నొకపాత్ర
మును రచించితి గాను ♦ ముఖ్యముగను
సకలపవిత్రమై ♦ సాధుజనాళికి
నెందిమానందంబు ♦ నొందునట్టి
విధముగాగను గొన ♦ విశ్వమందున నది
యెన్ని వంకలనున్న ♦ నెచటికేగు

చున్ననర్థానిలోనెర ♦ మురుగవిచిత్ర
వంతమూగాదె మలినస్తు ♦ పలుకునోకొ
నీవెరుంగనిధర్మము ♦ లేవిధాత్రి
చక్రధారిశ్రితమనోజ్ఞ ♦ చయవిహారి. 45

సీ. ఇలరేగుబండ్లకున్ ♦ విలసిల్లుముత్యముల్
నెలకుబోసినరీతి ♦ వేదవేద్య
వరకావ్యకన్యకల్ ♦ నెరిదుంటాత్ములకిచ్చి
మోసపోయితినను ♦ మూర్ఖసగిరి
గాకుండగా నేను ♦ ఘనస్తులు నీకృపా
వీక్షణాంబులచేత ♦ వెలయుకైత
మునుజెప్పినకునే ♦ ముసుముసకృతినీయ
బూనితినాతండ్రి ♦ పొసగగొనుము
నాకువాగ్ధారి గలిగించి ♦ ప్రాకటముగ
పద్యముఖిరంగమందుండు ♦ బరమపురుష
చేరికోలచెడనిన్ను హృ ♦ త్సారసమున
చక్రధారిశ్రితమనోజ్ఞ ♦ చయవిహారి. 46

సీ. అండజవాహనీ ♦ చండప్రతిజ్ఞకు
రెండవవేల్పుదా ♦ నుండగలడె
భండనభీమనీ ♦ బలవిక్రమమునకు
రెండవబలవిక్ర ♦ ముండగలడె
మండలాధిపనీదు ♦ దండిభటాళితో
సండజేరెడిభటు ♦ డుండగలడె
పుండరీకాక్షనిన్ ♦ బోలినసదయుండు
మెండుగాభూస్థలి ♦ నుండగలడె
టాంటటాంటటటాంటట ♦ టాంమటంచు
మింటధ్వనిబుట్ట సాటింతు ♦ మిక్కిలిగను
సరగనిభరాజుపై నెక్కి ♦ సంభ్రమమున
చక్రధారిశ్రితమనోజ్ఞ ♦ చయవిహారి. 47

సీ. వసుధశ్రీహాసనకు ♦ వననిధీశునకు
గిరిరాజసుతకును ♦ గీర్తి మెరయ
దిరుమంత్రరాజంబు ♦ బరువడినుపదేశ
మిచ్చిన వరద శ్రీ ♦ యిందిరేశ
హస్తికహల్యకు ♦ నల ద్రౌపదికి నార్తి
చుట్టంబనైయార్తి ♦ సొంపుమీర
హరియించి మెరసిన ♦ హరి మేశ నచింత
మనువకంఠాదికీర్తి ♦ గరుణ మెరయ

జేసితనివింటినాగీతి ♦ జేసినన్ను
ధృపునిపరదిగనేలవే ♦ ధృతివిశేష
మమునరసింహ మొక్కెద ♦ క్రమముగాను
చయవిహారి. 48

సీ. పంక్తికంఠారిసి ♦ పాదాంబుజమ్ముల
క్షీరగోత్సానయ్య ♦ విసుగులేక

సారంబుజస్థిత ♦ చక్కగాను
నసకాశ్రహాసిణిసి ♦ ఘనతరనామాళి
రసమ్ము దావినయ్య ♦ రమ్యముగను
చాయబాగనమునసి ♦ చారుదివ్యాక్షర
గీతపానము జేతు ♦ ఖ్యాతిగాను

కువలయాపీడవిధ్వంస ♦ కోమలమిగుల
మానసముననుచింతన ♦ మదినొనర్తు
కుంభకర్ణారిసేచెంత ♦ గోరినిలతు
బకనిశాటహరానిను ♦ బ్రస్తుతింతు
చక్రిధాంకిశ్రిత మనోజ్ఞ ♦ చయవిహారి. 49

సీ. దేహంపుజిలకను ♦ దివిరియొనుగు జక్క—
మాంసంపు జవికిసి ♦ మదికరంగి

నామ్నాయములంకోడ ♦ నరయగాబరమాత్మ
సృష్టియై గనుపించె ♦ స్పష్టముగను
క్షితిమమకారాదు ♦ లతిక్రోధకామాదు
లెల్లనుజూడగా ♦ కల్లలేక
జీవసృష్టియయ్యె యొప్ప ♦ జెలగిమిగుల
జీవుడై తాను గన్పించె ♦ జితవిధుల
జీవుడవు నీవె నీవునుర్ ♦ జీవతతివె
చక్రధారిశ్రిత మనోజ్ఞ ♦ చయవిహారి. 52

సీ. ఈషణత్రియమును ♦ నిలవస్త్రపట్కము
సమరసంబునఁగూడి ♦ క్రమముగాను
నరయనీశ్వరసృష్టి ♦ యనుచుబల్కినవారు
ధరసధోగతికిని ♦ దరలుచుంద్రు
యీశ్వరసృష్టికి ♦ నిలనుమోక్షముగల్గు
సాధనంబైయుండె ♦ సకలవిధుల
జీవసృష్టిదలంప ♦ జెలగిపునర్జన్మ
కారణంబైయుండు ♦ కనుగొనంగ
నరుసకామాదు లన్నిటి ♦ వదలినపుడె
జీవుడును ముక్తినొందును ♦ కేవలముగ
అన్నిటికినీవగాదొకో ♦ యాదిదేవ
చక్రధారిశ్రితమనోజ్ఞ ♦ చయవిహారి. 53

సీ. విషయాదులెల్లను ♦ వీడిపోయినగాని
యీజీవునకుముక్తి ♦ యెచటలేదు
యీశ్వరకృతమైన ♦ నీసృష్టిలయమొంది
మరలసృష్టియొనర్ప ♦ మరియు నరయ
నీజీవుడప్పుడు ♦ నింపుగా జన్మించు
చుండడె ప్రాణియై ♦ యొప్పుగాను
సకలజీవులయందు ♦ సమభావుడైయుండు
పక్షపాతములేక ♦ పరగనిట్టి

జీవుడును బుణ్యపాపకర్మములన్ ♦ జేయుచున్న
జీవుడే దేవుడేగాడె ♦ జీవతతికి
దేవజీవేశ్వరులటన్న ♦ నీవుగావె
చక్రధారిశ్రితమనోజ్ఞ ♦ చయవిహారి. 54

సీ. పరగ జీవులు జేయు ♦ పాపౌఘములకును
పుణ్యంబులకును నీ ♦ పుడమిలోను
వారివారికిదగు ♦ వరుసగా సుఖదుఃఖ
ములను గల్పించుచు ♦ ముఖ్యముగను
బుణ్యసంతతినెల్ల ♦ బాలుపొందరక్షించి
పాపజనాళికి ♦ బరగశిక్ష
యును నొనర్చుచునుండె ♦ నుర్విలో జీవుండు
సకలజీవులయందు ♦ సమ్మతముగ
నుండి నెల్గొంది మరియు న ♦ ఖండవిమల
వేదవేద్యుండవౌనీదు ♦ విమలరూప
మందు నైక్యంబు జెందడే ♦ నమరవినుత
చక్రధారిశ్రితమనోజ్ఞ ♦ చయవిహారి. 55

సీ. జపతపస్స్వాధ్యాయ ♦ నిపుణసద్వ్రతదాన
సదుపవాసంబులు ♦ సమ్మతలమున
నిష్కామిగను జేయు ♦ నెరిజనావళికెల్ల
చిత్తశుద్ధియు గల్గు ♦ సృష్టినరయ
నందు చేతనుగాదె ♦ యరయదత్త్వవిచార
వంతులై యుందురీ ♦ వసుధలోన
దానిచేతనుగాదె ♦ తనరసజ్ఞానంబు
హరియించి యామీద ♦ నద్భుతముగ
తానె బ్రహ్మంబటంచును ♦ తత్పథంబు
నీవెయైతివి రక్షించ ♦ గేవలముగ
జనకుడిది దెల్పగా లేదె ♦ ఘనశుకునకు
చక్రధారిశ్రితమనోజ్ఞ ♦ చయవిహారి. 56

## ఉత్తరగీతల సారాంశములు.

సీ. శ్రీకరమగు దివ్యో ♦ చేబూనినలయుద్ర
వ్యములెల్లగాంచి దీ ♦ పమును మొదటి
చోటవదలుమూడ్క ♦ సుజ్ఞాన విభవంబు
గలిగినతోడనే ♦ చెలగివెనుక
సాధనముల్ గన్న ♦ సకలశాస్త్రంబులుఁ
విడిచివేయగవచ్చు ♦ విశ్వమందు
ప్రథితసుధామధు ♦ పానంబు గొనువెన్క
నుదకపానముజేయ ♦ నొప్పిదంబె

ధూమ విరహితమైకడు ♦ దొడరువీతి
హోత్రుజ్వాలాభికాంతుల ♦ వ్రాలినిండు
స్వచ్ఛమగు నీపదాబ్జముల్ ♦ సంగగొలుతు
చక్రధారీశ్రితమనోబ్జ ♦ చయవిహారి. 57

సీ. నవరంధ్రములనొప్పు ♦ ప్రవిమలదేహంబు
చిల్లలభాండంబు ♦ జగ్గడట్టు
నుండుటచేగాదె ♦ యుర్వీసుజ్ఞానంబు
స్రవియించుచుండుబల్ ♦ చక్కగాను
సువిధంబుగనుండ ♦ నిలుపరబ్రహ్మంబు
కొంచెమైనను బ్రకా ♦ శించడయ్యొ
మనుజమాత్రుండునై ♦ మరిపరబ్రహ్మంబు
గనుగొనజాలునే ♦ క్రిమమునెన

దివిరివిజ్ఞానవంతుడే ♦ దెలియగలడు
చిత్కళాధామసిగ్గోష్ఠి ♦ చెనటికేటుల
దరముగుణరహితబ్రహ్మ ♦ మెఱుగుగాక
చక్రధారీశ్రితమనోజ్ఞ ♦ చయవిహారి. 58

సీ. ధర్మశాస్త్రంబులు ♦ తగనభ్యసించిచ
తుర్వేదవాదముల్ ♦ నిర్వహించి

యధ్యయనాదుల ♦ నతిగఁబఠించిన
పారంబెఱుంగని ♦ తీరుగాను
సకలభోజ్యాదుల ♦ సంచరించుచుఁగంటె
రుచిఁగోరంచెఱుగని ♦ రూఢిగాను
గంధపుచెక్కలు ♦ గడుమోసి గాడిదె
పరిమళమెఱుగని ♦ కరణిగాను

శాస్త్రములు నేర్చి నేర్చి ని ♦ ష్ఫలులెయగుచు
నీమహత్యంబుగానక ♦ నిఖిలజనులు
చెడుగుమార్గంబులందున ♦ జేరిరహహ
చక్రధారి శ్రితమనోబ్జ ♦ చయవిహారి. 59

సీ. జనుఁడెంతవరకునీ ♦ జగతిలో బ్రహ్మంబు
నెఱుఁగునందాఁక బల్ ♦ సరిగఁదాను
తీర్థయాత్రాదులు ♦ దివిరినిత్యంబును
నైమిత్తికంబులు ♦ నయముగాను
సల్పఁగావలయును ♦ సరగసద్బుద్ధిచే
బెక్కువర్ణములచే ♦ నిక్కమైన
యావుల నేకము ♦ లవనిఁగల్గినక్షీర
మేకత్వమైయుండు ♦ నేకబుద్ధ

తనువులనేకైననగాని యీ ♦ ధరణియందు
నాత్మయొక్కటియైయుండు ♦ నవనిగోవు
లట్లు దేహంబు లీక్షీర ♦ మట్లునాత్మ
చక్రధారి శ్రితమనోబ్జ ♦ చయవిహారి. 60

సీ. ద్విజజాతికగ్నియే ♦ తెలియంగదైవంబు
ఆత్మయేదైవమంచ ♦ లరుచంద్రుఁ
డానీశ్వరులు ధాత్రి ♦ పైనల్పమతులకు
వలనొప్పలోష్టాది ♦ లలితవిగ్ర

హాములై దైవములుగా ♦ నలరారుదత్త్వవే
త్తలకు నెల్లప్పుడు ♦ మెలగునన్ని
చోటులదైవము ♦ సూటిగా నున్నట్టు
లనుభవప్రోద్యోగిమై ♦ యవనినుండ
నదియె ఘనమైన కురుభూమి ♦ యదిప్రయాగ
యదియె నైమిశవనమునై ♦ యలరుగాదె
యిన్నిటికినీవె బ్రహ్మాయగా ♦ దిందిరేశ
చక్రధారిశ్రిత మనోజ్ఞ ♦ చయవిహారి. 61

సీ. బ్రహ్మనెరుగువాడు ♦ బరగభుజించిన
జగమందరును గడు ♦ సంభ్రమమున
భుజియించునట్లయా ♦ బుడమిలోనతిశయ
భక్తిగలినవారి ♦ బహుగదయను
సత్కరించినదది ♦ స్వల్పమైననుగాని
నతిశయంబుగ దోచు ♦ ననవరతము
యోగంబుతోగూడి ♦ యొప్పుచుండెడువాని
కుక్షినయన్నంబు ♦ గోమరుమిగుల
జీర్ణమొందిన ముందును ♦ జెలగివెనుక
సంతతియువారలెల్లను ♦ సరితరింతు
రనెడి యతిపీవమైతివి ♦ యబ్జనాభ
చక్రధారిశ్రితమనోజ్ఞ ♦ చయవిహారి. 62

సీ. ఎవనియింటను భిక్ష ♦ యెడతెగనినియతి
జరుగుచుండునచట ♦ పరమవిభుడు
గుడిచినయట్లవును ♦ గోమరొప్పజగమంత
దృష్టినిగాంచు మ ♦ హీస్థలమున
యోగియయినవాడు ♦ భోగేచ్ఛలనుమాని
పరమహంసుండుగా ♦ బరగవలయు
కాకోదరముచెల్మి ♦ కడుమానినస్సుగగ
జనచయంబులచెల్మి ♦ సరగవిడిచి

నట్లుశవమునుగనిదూర ♦ మరగినట్లు
దొలగియువతులగాంచిన ♦ దూరమునకు
పర్వులిడువాడె ముక్తుడౌ ♦ పద్మనాభ
చక్రధారిశ్రితమనోజ్ఞ ♦ చయవిహారి. 63

సీ. అశ్వమేధసహస్ర ♦ మాచరించినసప్త
సంతానములగన్న ♦ సరగనీదు
ధ్యానంబుబోలవు ♦ ధాత్రిపైబ్రహ్మహ
త్యయుసతీహత్యయు ♦ దధ్యమతిని
నొకమాటుధ్యానించ ♦ వికలంబులైచను
నేకపాదమ్మున ♦ నెసగనిల్చి
తపముజేసినగాని ♦ తనరవేయేడులు
నొకసారి నీకళ ♦ నొగిభజించు
సాటిగానేర్చునొక్కొటా ♦ టోటులేల
నెరిసమాధినిమరినిన్ను ♦ నెరుగువాడు
ముక్తుడగుటయుగాక స ♦ ద్భక్తుడగును
చక్రధారిశ్రిత మనోజ్ఞ ♦ చయవిహారి. 64

సీ. హృదయకమలమందు ♦ బదిలంబుగామహ
ర్లోకముండునురుచి ♦ రాకరముగ
జనలోకముండును ♦ దనరికంఠమునందు
కన్నుబొమ్మలమధ్య ♦ చెన్నుమిగిలి
వరతపోలోకంబు ♦ బరువడిభాసిల్లు
మూర్ధ్నంబునందుండు ♦ మొనసిసత్య
లోకమావెనుకను ♦ ప్రాకటంబుగనాభి
యందువెల్గుచునుండు ♦ నతిగమర్త్య
లోకమటుపయిగుక్షిని ♦ నేకతముగ
ఘునభువర్లోకమొప్పుచుం ♦ డునుమహాత్మ
స్వర్గమాగాదె వేదాంత ♦ సరణిగనిన
చక్రధారిశ్రితమనోజ్ఞ ♦ చయవిహారి. 65

సీ. నాసికాగ్రంబున ♦ వాసిగఁబూర్వనం
దమరావతి వెలుంగు ♦ నమరవినుత
దక్షిణకర్ణమం ♦ దక్షిణవహ్నిపు
రమువామకర్ణమం ♦ దమరుయముని
పురముమరియుదాని ♦ కిరవగునొకప్రక్క
నైరుతిపురముండు ♦ నాణ్యమొప్ప
పృష్ఠభాగమ్మున ♦ బొసగుపశ్చిమదిక్కు
వరుణపురంబుండు ♦ వాడిమెరసి
ఎడమచెవునకుదగ్గర ♦ నెసగవాయు
పురముభాసిల్లె మిక్కిలి ♦ స్థిరముగాను
దేవనీలోనివేగాదె ♦ తెలియనివ్వి
చక్రిధారిశ్రిత మనోజ్ఞ ♦ చయవిహారి. 66

సీ. ఉత్తరదిశయందు ♦ నుత్సాహమునుజెందు
కంఠంబునాదిగా ♦ కరిము మెరసి
వామకర్ణముచెంత ♦ ప్రథితమా దిక్కును
నామభాగంబునఁ ♦ వాసియొప్ప
వరధనదునిపురి ♦ కరమర్థి విలసిల్లె
నలకాపురమ్మను ♦ నాఖ్యతోడ
పుష్పవతి యనెడి ♦ పురముభాసిల్లెడి
బుష్పకారూఢమై ♦ పూర్ణముగను
చంద్రలోకంబునాచెంత ♦ సాంద్రముగను
కడుప్రకాశంబులోనుండె ♦ గళలుమించి
యిన్నియును నీకళలుగాక ♦ నెవరికళలు
చక్రధారిశ్రితమనోజ్ఞ ♦ చయవిహారి. 67

సీ. వామనేత్రంబునఁ ♦ సోమశేఖరుడైన
శంభుని పురముండు ♦ జృంభణముగ
వరకపాలంబునం ♦ దరయపరబ్రహ్మ
పురమువెల్గొందు మే ♦ లుప్పుణ్యలొప్ప

విశ్వంబునంతయు ♦ న్వివరింపనీ దేహ
మందు నున్నదిగాదె ♦ పొందుగాను
అండపిండాండ బ్ర ♦ హ్మాండంబులెల్లవి
తర్కించిజూచిన ♦ దనరిజగతి
దేహమును బొందియుండెను ♦ తివిరిమిగుల
సకలమును దేహమేనని ♦ సమతగనిన
దేహివేరేగదాయింక ♦ దెలియనెవరు
చక్రధారిశ్రితమనోజ్ఞ ♦ చయవిహారి. 68

సీ. నాసాగ్రమునదృష్టి ♦ భాసమానమనస్సు
చెదరనివిధముతో ♦ మదికుదురుగ
దగనిల్పిమిక్కిలి ♦ జగమందు నిశ్చల
సస్వరూపుడై ♦ మానుగాను
నేకమనస్సుతో ♦ ప్రాకటంబుగనొక్క
నిమిషమాత్రంబైన ♦ నిశ్చలతగ
నుంచినసదిగాదె ♦ నెంచఖేచరిముద్ర
యను పేరునొందెనీ ♦ యవనిలోన
నట్టిఖేచరిముద్రను ♦ యతులుమతులు
వేరెపోకుండగనుజేసి ♦ వేదవేద్య
నిన్నె సేవింతురెప్పుడు ♦ నిశ్చలముగ
చక్రధారిశ్రితమనోజ్ఞ ♦ చయవిహారి. 69

సీ. కాయంబువెనుకనుగ ♦ బాయకుండియుజాల
నుండినదానినే ♦ నుర్విలోను
వెన్నునసుండుటగ ♦ వెన్నెముకనియందు
రదినడిపీపని ♦ యందురిగాదె
పరగశిరస్సులో ♦ సరిగసహస్రార
మునకును వ్యాపించ ♦ మొనసిదీని
బ్రహ్మనాడియటంచు ♦ బల్కెదరెప్పుడు
దండవీణాకృతి ♦ దనరనందు

వలనగాదొకో నీపేరు ♦ తొల్లమిగను
గలిగెబ్రహ్మైక్యమేజెందు ♦ ఘనులకెల్ల
యిదియెనీపథమైయుండె ♦ నిలగనంగ
చక్రధారిశ్రితమనోజ్ఞ ♦ చయవిహారి. 70

సీ. అరయ యిడానాడి ♦ యనునొక్కటియుగాదె
వామనిశ్వాసంబు ♦ వరసమముగ
శశిమండలమునకు ♦ చనకగోచరమయ్యె
వామనాసపుటంబు ♦ వసతిమీరి
చంద్రమండలమున ♦ సరసబొందుగనుండు
వామదేశమునందు ♦ పరగగొలచి
యరయమూలాధార ♦ మలరిమొదలునిల్చి
సరిబ్రహ్మరంధ్రంబు ♦ వరకుగాను
పరగవ్యాపించియుండెనొ ♦ పాదుకొనియు
పితృమహాధ్యానమంచని ♦ పేరుబొందె
సర్వయానంబులీనైతి ♦ వుర్విదేవ
చక్రధారిశ్రితమనోజ్ఞ ♦ చయవిహారి. 71

సీ. పింగళనాడియౌ ♦ లింగశరీరంబు
దక్షిణపార్శ్వంబు ♦ దనరునందు
పుణ్యకర్మంబులుగా ♦ పొలుపొందజేయనై
సంప్రాప్తిజెందును ♦ చక్కగాను
దేవయానమటంచు ♦ దివిరి బునర్జన్మ
రహితంబటంచని ♦ రహినిదెలియ
వలయునొనిదిగాక ♦ నిలనర్చిరాదిమా
ర్గమనగబరగెడు ♦ క్రమతజగతి
సర్వయానంబులును నీవె ♦ సర్వభుతులు
సర్వపక్షంబులును నీవె ♦ సర్వమీవె
నీవెసద్బిందు వందునీ ♦ నిఖిలమునకు
చక్రధారిశ్రితమనోజ్ఞ ♦ చయవిహారి. 72

సీ. సరసపింగళయిడ ♦ సరిమధ్యగానొప్పి
యతిసూక్ష్మమైనట్టి ♦ సతతమవని
వరసుషుమ్నానాడి ♦ పరగమూలాధార
ములుమొదల్ కొనిచాల ♦ ముఖ్యగతిస
హస్రారచక్రంబు ♦ ననుసరించెడుదన్క
కుండలిశక్తిగా ♦ కోమరుమిగుల
గమబ్రసిద్ధినిబొందు ♦ ఘనసుషుమ్నానాడి
కగ్రభాగంబున ♦ నతిశయిల్లు
తేజమే బ్రహ్మతేజమై ♦ తేజరిల్లు
సకలసర్వాత్మకంబయ్యె ♦ సన్నుతింప
దీనిదెలియంగ వశమౌనె ♦ దేవతలకు
చక్రధారిశ్రితమనోజ్ఞ ♦ చయవిహారి. 73

సీ. శశిసూర్యపావకుల్ ♦ దిశలుగ్రహంబులున్
వేదముల్ ద్వీపముల్ ♦ వెలయునదులు
వరవారినిధులెల్ల ♦ మరిసప్తఋషులెల్ల
బరువడికులగిరుల్ ♦ బ్రహ్మలెల్ల
లోకపాలకులెల్ల ♦ లోకంబులెల్లను
ప్రాభవంబులునెల్ల ♦ ప్రతిభలెల్ల
సరిసుషుమ్నానాడి ♦ సన్మధ్యగతములై
సర్వచరాచర ♦ సమితినుండ
గలదటంచని శ్రుతిబల్కె ♦ ఘనముగాను
మంత్రపుష్పంబునందునన్ ♦ మరియువినమె
సర్వశ్రుతులును నీవయే ♦ సార్వభౌమ
చక్రధారిశ్రితమనోజ్ఞ ♦ చయవిహారి. 74

సీ. సరససుషుమ్నయన్ ♦ సన్నాడియనునది
సర్వనాడులకును ♦ సహజముగను
నూర్ధ్వమూలమునకు ♦ నుద్భవస్థానమై
పరునడిదీపించె ♦ భవ్యముగను

దిర్యగాదిమనుష్య ♦ దేవసంఘములకుఁ
లలితశాఖోపశా ♦ ఖలునుగలది
యగుచుపంచప్రాణ ♦ మగువాయుపథముచే
సర్వపరివ్యాప్తి ♦ సాక్షివగుచు
జగదుపాసనకారుఁడై ♦ జన్మరహితు
డైపరబ్రహ్మమైనట్టి ♦ యమలతేజ
మైననినుస్మరియింతునే ♦ ననుదినంబు
చక్రధారిశ్రితమనోబ్జ ♦ చయవిహారి. 75

సీ. వెలయుడెబ్బదిరెండు ♦ వేలనరంబుల
రంధ్రమధ్యస్థమై ♦ క్రమముగాను
జీవాత్మయనుసది ♦ జెలగుచుండునుసుషి
రాంతర్గతంబులై ♦ యలరియచటి
కరుగగఁ నడుమను ♦ కడువడిఘాలంబు
లాదిద్వారములెల్ల ♦ నడ్డగించ
వాటినిదాటియే ♦ వరసుషుమ్నను జెందు
వాయువుతోఁగూడి ♦ వరలునూర్ధ్వ
గమనమునుగల్గువాఁడౌచు ♦ ఘనతజీవి
బ్రహ్మయపరోక్షవేత్తయై ♦ బ్రహ్మమందు
నైక్యమౌనననీమాట ♦ యగదధాత్రి
చక్రధారిశ్రితమనోబ్జ ♦ చయవిహారి. 76

సీ. హంసోహమనుదాని ♦ కర్థమేమనినను
దెల్లియంగజెప్పెద ♦ దేటపడగ
నూపిరిలోపలి ♦ కుత్సుకమతిలాగు
నప్పుడుసోయని ♦ యందుఁజగతి
బయటికివదలినఁ ♦ బాటింపమిక్కిలి
హంగాదలంతురు ♦ ప్రాజ్ఞమతులు
జీవవిధంబునఁ ♦ జెలగియెల్లప్పుడుఁ
చలనంబుగల్గిన ♦ చందమాట

మరియుహంసోహమైయొప్పు ♦ గరిమతోడ
నిదియె యజపాసమంత్రము ♦ పృథ్విలోన
గురువు నీవుండనిక నేల ♦ గురువునాకు
చక్రధారీశ్రితమనోజ్ఞ ♦ చయవిహారి. 77

సీ. నడచుచునుండిన ♦ నయముగా గూర్చున్న
కాలమందునగాని ♦ లాలితముగ
భోజనకాలమందోజమై ♦ శయనించు
వేళలందెప్పుడు ♦ వేడ్కగాను
సర్వకాలములందు ♦ సమబుద్ధినెవ్వరు
వాయుభక్షణసేయ ♦ వలయునట్టి
వారికి నాయువుగ ♦ వసుధలోబోలంగ
బదినూర్లయేండ్లును ♦ బరగగలద
టనుప్రమాణంబు గలదని ♦ యవ్యయాత్మ
దెల్పితివిగాదె ధృవముగా ♦ దేవదేవ
అల్లనరునకొసంగితో ♦ నాత్మబోధ
చక్రిధారిశ్రిత మనోజ్ఞ ♦ చయవిహారి. 78

సీ. నదియుదాటను నొక్క ♦ పదిలంబుగలయట్టి
యోడనుగోరియు ♦ నొప్పుగాను
రూఢినానావచే ♦ పోడిమిదరిజేరి
నావగాల్చినమాడ్కి ♦ కేవలముగ
నధ్యాత్మభావంబు ♦ నాత్మగాంచినయెడ
శాస్త్రాదులింకేల ♦ చాలగాను
సరవిధాన్యచయంబు ♦ సంగ్రహించినవారు
తాలునుగోరని ♦ పోలికగను
నఖిలశాస్త్రంబులనువీడి ♦ యధిపులైన
నిన్నుగొలిచిన వారికి ♦ నిత్యముక్తి
గదసురాధారనగధార ♦ కావరావ
చక్రధారీశ్రిత మనోజ్ఞ ♦ చయవిహారి. 79

సీ. జీవుండు దేహమ్ముఁ ♦ జెలువుగా ధరియించు
నతనికి బంధంబు ♦ లరయ లేవు
దేహంబులో నుండి ♦ దెలియ జన్మంబెత్తి
నట్టివాడునుగాడు ♦ గుట్టుదెలియ
వరశరీరంబును ♦ వలనొప్పదాల్చినఁ
భోగరహితుండగు ♦ బొందుగాను
బంధ హేతువుతోడ ♦ బరగుభూతాత్మకం
బగుశరీరముదాల్చి ♦ యలరెనేని
బంధరాహిత్యుడనబడు ♦ భవ్యముగను
సకలబంధాళి దెగటార్చు ♦ స్వామివీవె
నీకుబంధంబుగలదటే ♦ నిర్వికార
చక్రధారిశ్రిత మనోజ్ఞ ♦ చయవిహారి. 80

సీ. దేహిసుఖుండగు ♦ దివిరిదుఃఖాత్మక
హేతువౌ దేహంబు ♦ నెందునుండు
వాడైననేగాని ♦ పోడిమిసుఖదుఃఖ
విరహితుండననొప్పు ♦ విశ్వమందు
పృథుమరణావస్థ ♦ పృథివిపైనొందినఁ
దేహస్థుడయ్యును ♦ దెలియనతడు
పంచత్వదుఃఖమ్ము ♦ బరగగాంచగబోవ
డిందుచేతనుగాదె ♦ పొందుగాను
దేహికెటుగల్గు షడ్భావ ♦ మోహతమము
లనువికారంబు లిలమీద ♦ మనుజపోష
సర్వజీవాత్మవీవెగా ♦ సర్వమునకు
చక్రధారిశ్రితమనోజ్ఞ ♦ చయవిహారి. 81

సీ. తిలలందునూనెదా ♦ చెలగుచుండెడుభాతి
వరక్షీరములయందు ♦ గరిమెతోను
సర్పియుండెడిరీతి ♦ సంతసమొందుచు
కుసుమంబులందునఁ ♦ గొమరుమిగుల

పరిమళంబులభంగి ♦ బహుతరఫలముల
బహురసంబులమాడ్కి ♦ వసుధలోన
దారువులనుశిఖి ♦ దనరుచుండెడుగతి
ఆకసంబునగాలి ♦ యరుగుకరణి
అన్నమయమయినట్టిదౌ ♦ నరయపంచ
కోశయుతదేహమందునర్క ♦ గోమరుమిగుల
స్వప్రకాశంబవగునట్టి ♦ స్వామివీవె
చక్రధారీశ్రితమనోజ్ఞ ♦ చయవిహారి. 82

సీ. మూర్తిస్వరూపంబు ♦ మునుకొని ధ్యానించు
యోగంబునకున్నన ♦ నొప్పుగాను
నరయనిత్యత్వంబు ♦ మరిలేదడంచని
బల్కితివదిగాదె ♦ భక్తవరద
మూర్తిరహితమైన ♦ ముఖ్యతపమునకు
శూన్యత్వమాచుండు ♦ జూచుటకును
శశవిషాణాదుల ♦ చందమైయుండుటన్
మునుదెట్లువర్ణించి ♦ మోదమందు
చుందురీరెంటిమార్గంబు ♦ నొగివచింప
వేజనార్గసయనినంత ♦ వేడ్కనరున
కీవుదెల్పితివాగదే ♦ కేవలముగ
చక్రధారీశ్రితమనోజ్ఞ ♦ చయవిహారి. 83

సీ. కాలపక్వంబున్న ♦ కాన్పించి నంతనే
శుద్ధమా మనసులో ♦ శోభితముగ
వేదాంతభావంబు ♦ విలసిల్లెనటమీద
వరప్రపంచమునకు ♦ మరియతీత
మయిన బ్రహ్మము మన ♦ మందునగాన్పింప
శూన్యత్వమేలేక ♦ సుస్థిరముగ
నెరిపరబ్రహ్మంబు ♦ సరిగసాక్షాత్కరిం
చియు గానుపించిన ♦ చెలువుగాను

పరగ నుత్తరగీతలో ♦ పార్థివునకు
దెల్పగాలేదె యివియన్ని ♦ తేటపడగ
వరదయాసింధు విశ్వేశ ♦ వాసుదేవ
చక్రధారిశ్రితమనోజ్ఞ ♦ చయవిహారి. 84

సీ. ముఖనాసికములకు ♦ పొందుగామధ్యను
శ్వాసనిశ్వాసముల్ ♦ సంచరించు
ఒకసారి కిరువదియొక్క ♦ వెయ్యారునూ
ర్మారులువీనినే ♦ ధీరమతులు
అజపగాయత్రి మం ♦ త్రాహుతియనబడు
జీవరూపంబుచే ♦ జెలగుచుండు
పాపపుణ్యములాది ♦ పంచభూతంబులు
పంచేంద్రియములతో ♦ పట్టుబడిన
జీవునకుపాధియుంగ్రి ♦ జెలగులింగ
జీవమంతటి తోడనే ♦ బోవుచుండు
బ్రహ్మభావంబు జెందినఁ ♦ బ్రబలుచుండు
చక్రధారిశ్రిత మనోజ్ఞ ♦ చయవిహారి. 85

సీ. కాయంబుజూడగన్ ♦ కడుమలినంబుతో
గూడియుండిన దాను ♦ గువలయమున
దేహియత్యంతంబు ♦ దెలియగా నిర్మల
త్వముజెంది యుండునో ♦ దనరభువిని
వర దేహి దేహంబు ♦ లరయనీరెంటిలో
శుద్ధ దేహమ్మున ♦ సారిదినాత్మ
కోయని యనినను ♦ నొప్పుగామలభాండ
మనగ గ్రాలెడిచోట ♦ మొనసితనువు
జలముచేతను శుద్ధియౌ ♦ చక్కగగన
నాత్మపరిశుద్ధుడౌటచే ♦ నవనిశౌచ
కర్మలెల్ల ననావశ్య ♦ కములుగావె
చక్రధారిశ్రితమనోజ్ఞ ♦ చయవిహారి. 86

సీ. జలముజలంబందు ♦ సరిగబాలునుబాల
యందునన్ గలసిన ♦ చందమౌను
ఘృతముఘృతంబందు ♦ గొమరొప్పగలసిన
నెట్లుభేదములేక ♦ నెగడునట్లు
జీవాత్మకున్ మరి ♦ శ్రీపరమాత్మకున్
భేదంబుగలదైన ♦ మోదముగను
యీయవిద్యనునెల్ల ♦ నపుడె బోనాడుచున్
విషయసంస్కారంబు ♦ విడివడంగ
జేసెనేనియుజీవుండు ♦ జిత్రగతుల
బరగబరమాత్మలోనిల్చి ♦ సకలమందు
దానెబరమాత్మయౌనట్టి ♦ దైవమీవ
చక్రధారిశ్రితమనోజ్ఞ ♦ చయవిహారి. 87

సీ. వరయాత్మగగనము ♦ వలెసూక్ష్మమైయొప్పు
చూడంగనెప్పుడు ♦ చూడ్కులకును
గానరాకనునుండు ♦ కడునడివ్వాయువు
కరణిగానుండును ♦ ఘనతనంత
రాత్మనుజూచిన ♦ నవనిగన్పడునొక్క
విషయచింతలచేత ♦ వివిధగతుల
నున్నవారలకేల ♦ పన్నుగా నానిర్మ
లాత్మదెలియనౌ మ ♦ హానుభావ
రూఢివేదాంత జన్యప ♦ రోక్షవృత్తి
రూపవిజ్ఞానమైన స ♦ ద్రూపుచేత
సంతరాత్ముడ్డనెనట్టి ♦ యవ్యయుడవు
చక్రధారిశ్రితమనోజ్ఞ ♦ చయవిహారి. 88

సీ. శాస్త్రంబులెల్లను ♦ సరగునలోకంబు
లోనవిచారింప ♦ మానితముగ
నున్నందువలనను ♦ నుర్విలో నొకవేళ
గొంతపఠించిన ♦ గొమరు మిగుల

దత్వార్థమెల్లను ♦ దనరసాధించగఁ
గాలంబులేదయ్యె ♦ గానవవని
నరునకాయుష్యంబు ♦ సరిగనూరేండ్లంచు
జాటిరయ్యద్ది శా ♦ స్త్రంబుగాదు
మరిగృహచ్ఛిద్రములవల్ల ♦ మహినివిఘ్న
కరములైయ్యుండు నదిగాదె ♦ కమలనాభ
భక్తివలనను నెంతైన ♦ ముక్తిగలదు
చక్రధారిశ్రిశమనోజ్ఞ ♦ చయవిహారి. 89

సీ. భూమండలంబున ♦ బొసగమానవతతుల్
పరగనుపస్థయు ♦ మరియుజిహ్వా
లనువాటియందెప్డు ♦ దనివినొందనిరీతి
దృష్టిజేయుచునుంద్రు ♦ తోడరిమిగుల
ఆయోనిజిహ్వాల ♦ యందున బరగెడి
చపలంబులనువీడు ♦ నిపుణులకును
సరగలోకాళితో ♦ సంబంధమే లేద
టంచునితలచరే ♦ యార్యులెల్ల
రీజగమునకతీతుడ ♦ వీవయగుట
సరిగ నీరూపుగన లేరు ♦ సకలసురలు
నాకు దరమెవర్ణింప ♦ నాథనాథ
చక్రధారిశ్రితమనోజ్ఞ ♦ చయవిహారి. 90

సీ. వరపూర్వ విషయముల్ ♦ పరగవిసర్జింప
గల యోగివర్యుండు ♦ ఘనముగాను
వపురక్షణమునకు ♦ వనరగు భిక్షయుఁ
చలినివారణకునై ♦ కలిగియున్న
చినిగినచేలంబు ♦ మనసుగోరుచునుండు
పాషాణమును మది ♦ పసిడి శాక
మునుమరిశాల్యాన్న ♦ మునుసమంబుగదాను
జూచుచునుండును ♦ చూడ్కులకును

సూక్ష్మతత్త్వవ లోకమే ♦ సొంపుగోరు
యోగివర్యున కివిగాదె ♦ భోగరహిత
యోగముల్ గానసీవయా ♦ యోగివరయ
చక్రిధారిశ్రితమనోజ్ఞ ♦ చయవిహారి. 91

సీ. వరయతికిడినట్టి ♦ పరమభిక్షను నిరా
హారమేయని దాని ♦ నెరుగవలయు
నేగానిభిక్షను ♦ నెరిగ్రహించినరీతి
గను నెంచగూడదే ♦ కరణిసైన
యతికొసంగినభిక్ష ♦ నతిరసంబైనను
మంచిదిగాకున్న ♦ మనసుకుదిరి
యొసగినవారలీ ♦ యుర్విబ్రత్యహమును
సోమపానమ్మొన ♦ ర్చుటకుసాటి
ఫలముగాంచెదరదిగాక ♦ బరగనీకు
నిత్యసంతర్పణలుజేయు ♦ నిత్యులదశ
చెప్పశక్యమె నాతండ్రి ♦ శేషశయన
చక్రిధారిశ్రిత మనోజ్ఞ ♦ చయవిహారి. 92

సీ. తనదగుహిమవంత ♦ మునుబాపుకొనసూరు
చింపులుగలదైన ♦ నింపువసన
మనిధరించియువేడ్క ♦ మౌనముద్రనుదాల్చి
స్వానుభవమ్ముగా ♦ సల్పునట్టి
యోగంబుచేనొప్పి ♦ బాగుగాజరియించ
మెచ్చుచుందువుగాదె ♦ సచ్చరిత్ర
బూటకంబగునట్టి ♦ పుడమిడంబస్థితు
లణగజేతువుగాదె ♦ యనవరతము
నీదుసద్భక్తిం బరికింప ♦ నిత్యముగను
సర్వదుర్గుణచయమంత ♦ సమసిబోదె
వరగుణాధీశ ముచికుంద ♦ వరదశౌరి
చక్రిధారిశ్రితమనోజ్ఞ ♦ చయవిహారి. 93

సీ. ధ్యానయోగంబుచే ♦ దనరిన నొకదారు
వందునబుట్టిన ♦ యగ్నిపగిది
నగ్నిలో నైనుండు ♦ నారణికడువడి
కర్మంబులనునట్టి ♦ కరముత్రాళ్ళ
వలననుబంధించి ♦ వరుసమథింపగా
దానిలోబుట్టు సు ♦ జ్ఞానయగ్ని
గాలివశంబుచే ♦ గడుకర్మచయమంత
దగ్ధంబులైపోవ ♦ దనరధాత్రి
నపుడు సుజ్ఞానవంతుడై ♦ యమృతపథము
జెందునాగామి సంచిత ♦ జీర్ణవృత్తి
నట్టివాడవునీవెగా ♦ యరయధాత్రి
చక్రిధారిశ్రితమనోబ్జ ♦ చయవిహారి. 94

సీ. తూర్ణనాభియనను ♦ దొడరి సాలెబురుంగు
తనశరీరమ్ముాన ♦ దప్పకెపుడు
నూలునుబుట్టించి ♦ చాలగా చిత్రంబు
లగునల్లకములతో ♦ నమితవిధుల
దానెసృష్టిస్థితిన్ ♦ దగులయభూతుగన్
జేయుచుండెనుధాత్రి ♦ జెలగివేడ్క
బరగనీవిధముగన్ ♦ మరినీ ప్రపంచంబు
మనమందు దిలకించి ♦ మాన్యులకట
చింతలెల్లను దిగనాడి ♦ చిత్తమందు
బ్రహ్మముంజేరి యుందురో ♦ భక్తరక్ష
బ్రహ్మలకు బ్రహ్మవైతివో ♦ ప్రాకటముగ
చక్రిధారిశ్రితమనోబ్జ ♦ చయవిహారి. 95

సీ. శ్రీకంటెపూడి పు ♦ రీవరంబందున
పింగళివారను ♦ పేరువడసి
సద్భక్తుడనగను ♦ జగతి బ్రసిద్ధిచే
దనరుమల్లయ్యాఖ్యు ♦ ధర్మపత్ని

మైనకామాంబకు ♦ ననుగుసుతుండనై
. హరిహరబ్రహ్మల ♦ ననుదినంబు
భక్తినిగొలచుచు ♦ బరగు సుబ్రహ్మణ్య
కవిపూర్వ వెంకటా ♦ ఖ్యను నెసగుచు
నార్యులకుసేవ లొనరింతు ♦ ననుదినంబు
శతకమురచించి యొసగితి ♦ శక్తికొలది
దీనిగైకొనుమయ్య ♦ దీనపోష
చక్రధారిశ్రితమనోజ్ఞ ♦ చయవిహారి. 96

సీ. ధరణిభారద్వాజ ♦ వరమునిగోత్రుండ
నారువేల నియోగు ♦ లందునొకడ
ప్రవిమల మయినయా ♦ పస్తంబసూత్రుడ
హరిభక్తినేప్రొద్దు ♦ నరయువాడ
కంటెపూడి శివారు ♦ కట్టవార్పరముల
కరిణీకనిరతిమై ♦ గ్రాలినాడ
దాసజనావళి ♦ దాసుండనై చాల
కూర్మితో పెద్దల ♦ గొలుచువాడ
నరహరినినాత్మ నిరతంబు ♦ నమ్మినాడ
నన్యచింతలపై భ్రాంతి ♦ నడచినాడ
సన్నిధిని జేర్చుకోవయ్య ♦ సన్నుతింతు
చక్రధారిశ్రిత మనోజ్ఞ ♦ చయవిహారి. 97

సీ. కోదండరాముని ♦ కొలువెరుంగుదుగాని
గ్రంధముల్ రచియించు ♦ ఘనమెరుంగ
యతిగణప్రాసంబు ♦ లతిశయంబుగగాన
లక్షణమార్గంపు ♦ లఘువెరుంగ
శబ్దార్థలక్షణ ♦ శైలినేమియెరుంగ
సప్పకవీయంబు ♦ నరసియెరుగ
అమరసంగ్రహమును ♦ వ్యాకరణంబును
మొదలెజూడగలేదు ♦ యిదినిజంబు

తప్పులున్నను దయయుంచి ♦ యొప్పుగాను
సవరణలుజేయ నాకోర్కె ♦ సఫలమంద
సుకవులకు మ్రొక్కితీవేళ ♦ శోభితముగ
చక్రధారీశ్రిత మనోజ్ఞ ♦ చయవిహారి. 98

కృ తి ప తి వం శా ను క్ర మ ణి క.

సీ. తొల్లిమల్లయకవి ♦ చల్లగాశ్రీశైల
మందునగూర్చుండి ♦ యటతపంబు
జేయుచున్నంతలో ♦ జెనటులు రోహిలాల్
కరవాలములచేత ♦ గాయమంత
నరుకుచున్ననుమది ♦ హరమహాదేవయం
చురునుతుల్ సల్పెడి ♦ తరితుపాకు
లెల్లబారులోనర్చి ♦ యేయమ్రోగకయుంట
చింతజేబోయిరి ♦ శ్రీఘుగరిమ
పరమభక్తుండు సుగుణుండు ♦ భాసురుండు
సంతతానందభావుండు ♦ సాత్వికుండు
యిట్టిభక్తవరుండిల ♦ యెవరుగలరు
చక్రధారీశ్రిత మనోజ్ఞ ♦ చయవిహారి. 99

సీ. శ్రీరవికులజాత ♦ శ్రీజానకీనాథ
పావనాకారమై ♦ పరగునీదు
నిర్మలకీర్తిని ♦ నేసీసపద్యంబు
లనుగూర్చితినిగాదె ♦ ఘనతరముగ
పద్యమాధుర్యమా ♦ ఫలసమర్పణనీకు
చిత్తమందిచ్చితి ♦ శ్రీనివాస
కైకొనిదయచేత ♦ ఘనపద్యసుమమాల
గంఠమందునదాల్పు ♦ కమలనాభ
భక్తివలనను నీకునా ♦ భావమందు
నర్పణము జేసితిన్నియున్ ♦ సర్పశయన
పరమవాసుండ కౌసల్య ♦ వరసుతుండ
చక్రధారీశ్రితమనోజ్ఞ ♦ చయవిహారి. 100

